# విషయానుక్రమణిక

## ఆగస్టు 1958

# కరుణాలహరి

## శ్రీ బూర్గుల రామకృష్ణరావు

* గతసంచిక తరవాయి *

మృగమ్ముఁ నాగము నావలెన్ భవమునం దెంతేనియుం జిక్కి తా
ముఁగచాల్లం బన, నన్నుమాని మఱి యీ యన్నింటి విప్పించి నా
వు గదా! నన్నీడిపింప కుండుటది బాబూ! నిదు డెందమ్ముఁ బి
ట్టగలింపం జనదే? యదేమి కత మప్పా! పక్షపాతావహుఁ?

ఏగతిలేని యార్తులకు నీవ శరణ్యము పాపహారి! యం
చాగమ తత్త్వముల్ దెలుప, నట్టిఁడ వీవని నిశ్చయించి నే
నేగి సమస్త పుణ్యముల హేళనముం బొనరించినాఁడ, నీ
లాగున నంబుజేక్షణ! తలంప నొకింత యదేల చెప్పుమా!

పతితులఁ బ్రోవగాఁ గలుగు పావనమూర్తివి నీవయంచు నే
సతతము వేదశాస్త్రములు నల్వురుమోవను బాగవింట, దు
ష్కృతములచే యుపాసనము సేసితి నోవరదా! యశేష దు
ర్గతులకు నీవసద్గతివిగా మదిఁ గట్టిగ నమ్మి శ్రీపతీ!

మనుసుకృంతంబులఁ బాటిపోయియు సేయనలేద యెన్నఁడున్,
విను మఖమ్ముఁ దుష్కృతము వేమరు సేసితి, నీదు ముందటఁ
గొన కిపు డేమి పల్కవలె కొంకును జంకును ఏడి? సిగ్గు యె
గ్గనునది లేదుగాని యొకి యంతయు గర్వము లేదు శ్రీహరీ!

మదమును గామమోహములు మత్సరముఁ బలమెల్ల యెత్తి నీ
యెదుటన శత్రువుల్ గదిసి యింతగ నన్నిటు లేడిపింపగా
వదిర! గదారి నందకము లాపము శార్ఙ్గము చేతఁబట్టియున్
గదలవు సిగ్గు సొందవు కవన్ నను గాదని యుండు వేలరా?

గోతనుబద్ధబిడ్డఁ గని కొండొక దారిని బోవువాఁడును
బ్రీతిని జాగు సేయకయ పేరిమితోడుత నుద్ధరించెడిఁ,
బ్రాతవు నీవు నోజనక! దారి భవాంబుధి దూకుచున్న యీ
లేత వయస్సువాని గని లీలగఁ జూచుచు నూరకుండు దే.

* జగన్నాథ పండితరాయల కృతికి అనుకృతి

వరపుణ్యప్రియ! పుణ్యవంతులకు సర్వశ్రేయముల్ గూర్తువన్
బిరుదల్లంతగనిమ్ము; పాపినగు నన్ వే ప్రోవరావేని యా
ధర విశ్వంభరుఁడన్న పేర్మిలువ దంగన్ గాచి కావిమ్మవు, ఎ
వ్వరు గాదన్నను నీవు గాదనక నన్ బాలింపు లక్ష్మీప్రియా!

పరుసము లెన్నిరో యకట! పల్కుచునుంటి నటంచు రోసమున్
విరసముఁ బూనకయ్య, యొక వేళ రుషాత్ముఁడవైన దోసమున్
మురహర! కోటికల్మష విమోహితునిన్ మఱి పాపదూరు ని
ర్భర కరుణాబ్ధిలో విసరివైవు, జగద్భరమింక తప్పెడిన్

కృతము గణించి నాకవల నెల్లసుఖమ్ములనుగ్రహింతొ యా
శ్రితుఁడను నే గ్రహింపనవి చిన్నము పున్నము సేసియుంచమిన్,
పతితుల నుద్ధరించుట స్వభావము నాకని యేలు దేవి శ్రీ
పతి! తలఁదాల్తు నీదయ యవశ్యముఁ దుష్టియుఁ బుష్టి సెందెదన్

పతితుఁడనైన దుఃఖముల పాలగువాడనునైన నెంతో దు
ర్మతియుఁ గృతఘ్నుఁడే యయిన మంచితనమ్మనుమాట లేకయే
బ్రతికిననైన సిగ్గువడి ప్రాంజలినై భవదీయుఁడన్న న
ప్రతిహత మీకు! నీదయకుఁ బాత్రుడగున్ గద యా యపాత్రుఁడున్!

చతురతఁ బుణ్యమే సలుపు సాధులపైఁ గృపఁ గుమ్మరింతు వా
ప్రతిఫలమేమి నీకటఁ కృపానిధి! యీ ననుబోటివానిపై
సతత కృపాకటాక్షముల పాల్కొనఁ జేసిన నాడు నీదు కీ
ర్తి యది యేమి వేసము ధరించునో నీవ గ్రహింపు మాధవా!

ముమ పోకనాడు లాలనము పొందిన బిడ్డఁడు తండ్రిచేత నీ
దున, మఱి బుద్ధి నేర్వగ గడుంగడుఁ దాడితుఁడౌటయుక్త, మా
లనయును బాలనన్ దెలియ లాలన నీయెడ నే నెఱుంగ, ప్రా
క్తన నిజ పాపకర్మమునఁ దన్నులు తింట యొకందు దక్కరా!

"భగవన్!" నే బహు దోషదూషితుఁడనై పాపౌఘముల్ ముం గా,
వగలన్ మున్గుచు నేమి తోచక వృథావాగ్ధోరణిన్ దిట్టితిన్
బగతిన్ బాంధుఁడు ప్రేయసీ విరహజ జ్వాలాగ్ని సంతప్తుఁడై
వగతో నయ్యయ్యొ కాంతుఁదిట్టునుగదా! భద్రాను సంధాయకా!

## క రు ణా ల హ రి

ఓ కరుణానిధీ! మిగుల నుద్ధతిమై దహియించె దుర్దశా
వ్యాకులుఁ బాప పంజరుని బట్టుక కీలిచి పిప్పిసేసిన
ట్టా! కను వేదిమో జ్వర మహారక్ష్యహమ్మృతసాగరా! నరుం
జేకొని పీడకున్నది యికీ! క్షణమేని యిఁకేమి సేయుదున్.

అల్పుఁడనై కటాక్షుల నిరంతర జల్పనముం బొనర్చ నం
కల్పితహాని నాదుపయి కారణికోత్తమ! నీకుఁ గ్రోధ మ
త్యల్పముమో! గజేంద్ర తె కుపితాతుర బాలక భాషితమ్ములం
దెల్పు! మహానుభావులు సుధీ నిధు, లాశ్రిత లోకపాలకా!

ఉరగారాతి సుకేతనా! కనుమమో! యుత్తంభితాశాసము
త్కర హోరారావముఁ జట్టికొంటి, జటిలో దగ్రజ్వరోన్మత్తకుం
జరవజ్రాంకుశ, నన్ మహోజ్వరశిఖజ్వాలావళీధుర్య నిరా
దరతన్ పీడకు ముక్కుకొందును మహాధన్వంతరీ! శ్రీహరీ!

ఏనన దుష్కృతమ్ము లవి యెన్నఁడు సేయన లేదటంచు, నో
దానవ వైరి! పల్కెద యథామతి నొక్క నిజ, మ్మదేమనన్
మానసమందు భీతి ననుమానముఁ బాపి ఖగేంద్రయాన! నీ
యాన, సుధానిధాన, పతితావన పావన నామగానముల్

శర్వ పితామహాదులును సర్వ సుపర్వనిశాచరావళుల్
నిర్వచనమ్ము సేకయు నిన్ బొగడోప్తైముఁ డంచుఁ గొల్వ నిన్
గర్వ మఖర్వ మూని యిటు గంటె యుపాలభమాన వాక్కులన్
జెర్వడు పీడిపీ! ఖలుఁడు ఛీ! కను ఛీ! యిదె పాడు బుద్ధియున్.

సకలమ్ముల్ వినినాడినాఁడ, మఱి నా సర్వస్వముల్ సేవ, చి
న్నిఁక నే కోరిక యేనికోర నిదిగో యూ కొంచె మర్థింతు, ని
యకలం కాద్భుత మెల్లయందముల కాహో యందమే మూర్తి మా
మక హృన్మందిర గోచరమ్ముగుత, శ్రీమందార మాలాధరా!

స శే షం

# హరవిలాసము: దేవదారు వనవిహారము

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

శ్రీనాథుఁడు బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడు. శివ్ని పాదలబ వాణీ ప్రసారముఁ బరమేశ్వరు నారా ధించినవాఁడు. సంస్కృత కవులలోఁ గవితా గుణోప హారములఁ బార్వతీ పరమేశ్వరుల నారాధించినవాఁడు కాళిదాసు. అతని యడుగు జాడలలో నడచినవాఁడు శ్రీనాథుఁడు. వివిధ రసభావములను బరమేశ్వరాలం బనముగఁ జిత్రించుటలోఁ బెక్కు విషయములం దిరువురకును సామ్యము గానవచ్చును. శ్రీనాథుఁడు కావ్య సంతరించిన హరవిలాసములోఁ ద్వితీయ చతుర్థాశ్వాస ములందు కుమార సంభవ కావ్యాను సరణము గావించుట యెందులకో విదగ్ధవేద్యము. కుమార సంభవ కావ్యమునం దష్టమ సర్గలోఁ బార్వతీ పరమేశ్వరాలం బన శృంగార రస భావములు పరాకాష్ఠనందింపఁబడి నవి. హరవిలాసమున పార్వతీ పరమేశ్వర వివాహము వఱకు కుమారసంభవమునందలి కథావస్తువు నాదరించి, పిమ్మట శృంగార రస సమగ్రతి నాపాదించుటకై శివ పురాణమునందలి దేవదారు వనవిహార కథావస్తువు గైకొనినాఁడు శ్రీనాథుఁడు.

శైవ కవులు శివుని విలాసములలో దేవదారు వన విహారమును ప్రథమముగ గణించి, తదాశ్రయమున శృంగార రసభావములను బరమేశ్వరాలంబనముగ నతి మాత్రము చిత్రించుట యొక పరిపాటి. ఆ ప్రక్రియ మునఁ బరమ శివభక్తుఁడైన శ్రీనాథుఁడు దేవదారు వన విహార కథావస్తువును దన హరవిలాస కావ్యోపస్కార కముగఁ గైకొనియు శృంగార రసభావముల నతి మాత్రముగఁ జిత్రింపఁదలఁచియు నౌచిత్యమునకు రస పోషణమునకు పారవశ్యమునకు భక్తి భావ నిష్కృతికి లోపమేపాటియుఁ గాకుండ నిర్వహించియున్నాఁడు. ఈ దేవదారు వనవిహారము సంస్కృతమున ఉత్ప్రేక్షా వల్లభుఁడను కవి రచించిన భిక్షాటన కావ్యమునందును, తదితర శైవకవుల కృతులందును గానవచ్చును. కాని యా రచనలన్నియు శృంగారరస నిర్వాహణమున నుచ్ఛృంఖలములై నడచినవియే. శ్రీనాథునకు నను కాలికుఁడగు నిశ్శంక కొమ్మనామాత్యుఁడు, ఈతని కాశీఖండ కృతి భర్తయగు వీరభద్రారెడ్డి సోదరుఁడు దొడ్డారెడ్డికిఁ గృతిగా నొసఁగిన శివలీలా విలాసము నందును దేవదారు వన విహారమును జిత్రించియే యున్నాఁడు. అదియు శృంగార రస భావావిష్కరణ మున నుచ్ఛృంఖలమై కొనసాగినది.

శ్రీనాథుఁ డీయితివృత్తముఁ జేఁబట్టి కవ్యౌచిత్య మును సంతరించుకొనుచు రస నిర్వహణమునఁ బ్రతి ధానము సంయమనము నలవరించుకొని, శృంగార రస మును భక్తిలో మేళవించి చరమసీమకుఁ గొనిపోయి నాఁడు. ఆ విషయము నిట నా యూహాకొలఁది వివ రింతును. పరమేశ్వరుఁడు పార్వతిని పెండ్లియాడి, మన్మథుని పునరుజ్జీవితుని జేసి, పరిషద్గణము తమ్ము భజించుచుండ రతి నగమున నత్య కుటుంబభార నను వ్యుఁడై సంసారసుఖ మనుభవించుచుండెను. పార్వతి మీఁది వలపుచేఁ ద్రిలోకాధీశ్వరుఁడైనను హిమవంతు నింట నిల్లడముండెను. ఏనాఁడైన నత్తవారియింట నిల్లటముండిన యల్లునిపై నత్తవారి కనాదర భావ మేర్పడకపోవదు. ఈశ్వరునకునైన నట్టిది తటస్థించె నని తెలుపుదు—

> "అత్తపైఁ గూర్మిఱట్టడికా! యాదియింట
> నిల్లడంబుండెఁ ద్రిభువనాధీశ్వరుండు."

అనినాఁడు. త్రిలోకాధిపతియైనను భార్యమీఁది వల పుచే నత్తవారింట నిల్లటముండుట యనివార్యమని యింగు ధ్వనితము.

ఇప్పటి యీశ్వర వేషము శ్వశుర గృహనివాస యోగ్యమాత్మాలంకార పరిశోభితము. ఇంతకుముందు నాగయజ్ఞోపవీతధారి యగుచు బంగారు జన్నిదములు ధరించుచున్నాఁడు. ఱంగుఁడీపుడు గజాసురచర్మము వీడి పట్టుపచ్చడములు దాల్చుచున్నాఁడు. భస్మాంగ రాగము విసర్జించి కస్తూరితో మేదించిన శ్రీ గంధ ములఁగుముచున్నాఁడు. ఎముకల పేరులు వదలి ముత్యాల హారములు ధరించుచున్నాఁడు. జడలపైఁ బాగడ చాల్పును ధరించి బాలచంద్రు నలంకారముగఁ గూర్చు చున్నాఁడు. ఇట్లు చంద్రశేఖరుఁడు పెండ్లికొడుకు

నిభృత కమ్రకాన్వభిక్షు మొనఁగెను తిర్యగ్రేఖాంకన లలాటభుజంగభూషణాంకుఁ డపాంగ రంగస్థల లావణ్య లంపటంబు కటాక్షవీక్షణంబు తోఁ జూచుభిక్షాన్నంబుల సమార్జించెనని '

శివదాగమన వేళావాటమున మదనవైరి భిక్షాటనము సేయునప్పుడు అప్పు విలాసినుల విలాసము లేరీతియో కవాటియో వారిని గురవరు వర్ణించిరో ఆ క్రమమున నే నరిగిపుట్టు దంపతులకుకు భూపదీపాద్యుపచారంబులు గైకొనుచు, వంతిటేరోఁ దినిదినక కరక గర్భక పాత్రంబు పూర్ణించే కరపల్లవంబున నులపీల, వల్లవల్లవ యోగపాగు కౌయుగళంబు గల్లుగల్లన మోయ ముని జనాశ్రమంబుఁ బ్రవేశించినాఁడు శివుఁడు మునివాటమున భిక్షాపాత్ర తేఁ గారణము కేక వాటమునఁ దన భిక్షాపాత్ర మస్తంపూర్ణ మగుటచే దానిఁ బూరింపఁజేయుటకని కడు ముద్రితముగఁ దెలిపి యున్నాఁడు. అటనుండి మునిపత్నుల మనోహరణ దక్షమగు సౌందర్యమును తిత్సముచిత విభ్రమభంగిని కలకనుసెఁ గాన్పింపఁజేసినాఁడు

హరుఁడు మునిమందిరంబుల మొసలవిలిచి,'భవతి భిక్షాం దేహి' యని వారి వాహా గర్జ గంభీర స్వరంబునఁ బలుకుచుఁ, కులాంగనాజనంబు నపాంగ దృక్తరంగంబుఁ జెలుపగపులిపిలింకిలువారిఁ గనుంగొనుచు, సంయమిజనభూపాలి ప్రత్యర్థంగంబు దనకుఁ బరగు ప్రయోజనంబుగా విర్కగర్భకి సందర్భంబుల విలాసంబు దెలపబుముచుఁ బ్రకటింపం దొడంగిన—

మ. దరహాసంబుల భ్రూ లతా నటన ము
గ్రా విభ్రమ ప్రౌఢిమన్
బరిహాసోక్తుల భావగర్భరస సం
పల్లంపటా లోకన
స్ఫురణాభంగుల మౌనికాంతల మనం
బుల్వ్యారలాడెన్ శివ
శ్రీయుఁ డుద్దామ విలాసదారువనికా
వాట ప్రదేశంబునన్

—హరవి—౪౯.

సీ. సులభరూగ్యాండిదేయు కునశ మాంబాయమ
కుశ పైల సంప్రసూనరూలింప్లైఁ
బూర్ణ్యగృహిణులఁ బతిభక్తి పూర్ణమతుల
భాగ్యసంపన్నలను బుత్రపౌత్రవతుల
పతులు ముత్తైగువులను విశ్వకృత్తి
ధరునికరుణం జెమాలి నరాకిగొలిచె

ఉద్దామ విలాసియగు మహేశ్వరుఁడు దారుకావనవాట ప్రదేశంబుల మునికాంతల మనములను మందహాసములతోడను భ్రూభంగవిభ్రమ ప్రౌఢిమలతోడను, వర్గ్మభావితములైనదను, భావగర్భితాలోకనముల తోడను దూఁగులాడినఁట. ఇట్టి శ్రీనాథుఁడు శృంగార రసభావ వ్యగ్రవిమతముంఁ బాటించిన సంయమ కూర్పోతీను. ఇటి వర్ణనలుగు రసావిష్కరణ తత్త్వము తెలిసిన కాళిదాసాది మహాకవులకుఁ గొందఱికి గాక సంభవము పాటించుట యందఱకు వలనిగాదు ఇట్టి స్త్రీలంగు శృంగార భావములను, గిగుద్వ్యాకచేష్టాదికము నెంత విరివిగనైనఁ బ్రపంచింపవచ్చును ఈ తిగుణము ంగు సైతము భావము వతి విధిషము సేయుచు, సాంకేతికంగను గమింపక, జుగుప్సారసాభావము పోకుండ హరుని విలాసాదికము శ్రీనాథుఁడు వర్ణింపఁ గలిగె ననుటలో నాతనికిఁ బరమేశ్వరునెడఁగల భక్తి భావమే కారణము పరమేశ్వరుఁ డిట్టి విలాసముల చేత నే తన ప్రయోజనమును సాధించెననుటకు 'పతిభక్తి పూర్ణమతులను, పుణ్యగృహిణులను పుత్రపౌత్రభాగ్య సంపన్నలను, పతులను, ముత్తైదువలను సైతము విరళి గొలిపెనని వివరించినాఁడు. మఱియు మునిపత్నీ పాతివ్రత్యంబును భంగింపఁజేసిన విధము నతిగంభీరము గను భావగర్భితముగను సముచితముగ సాగించినాఁడు.

ఈ ఇట్లు ప్రతి గృహంబున భిక్షాటనంబు సేయుచు మహోక్షలాంఛనుఁడు నాంధానుకూలక్రోశంబున లోఁగుపరత వ్యాపారపరాయణుండై మగల కన్నువెంటెంగి, సంధ్యాసమయంబుల నముష్ఠానార్థంబుఁ బుణ్యషులు సమిత్కుశ ఫలాహరణార్థంబెండనిఁ జనిన యెడను వేచి, కపట తిక్షాటనంబును నిగూఢవిశ్వాసోచ్ఛ్వాసంబుల నివారిత సల్లాపంబుల నిమేషమాత్రి సాహ్యంబును నిబిరీనభయానంపంబు నెడ సంభోగంబు లభిలషించు నారంభోరుపుల మదనశిఖా శిఖాసంగత వాక్యంబులను, సంకేతస్థాన కంకిలిబంధముల నికుంజక్రోడ సంకేళ క్రీడల, మహాంధ్య మూతీ పరామర్శంబులను, భ్రూలతా దేశంబులను, నపాంగ రంగస్థల లావణ్యలంపట కటాక్షవీక్ష విక్షేపంబులను మందహాస కంపిత పరిస్పంద బాహు గంధర్వ ప్రబోధకందం బనుభవింపఁజేసి మెప్పించుచుండును గాక

# అంతర్వాహిని

**'హితశ్రీ'**

రివ్వురివ్వున వీచే గాలుల్లో జనతా ఎక్స్‌ప్రెస్ ముందుకి దూసుకుపోతూ పట్టాలు మారుతోంది. తనకి చేరువగా వున్న కిటికీ అద్దం పైకిలాగి విశ్వం తూర్పు దిశగా చూశాడు.

వయ్యారాలు వొలకబోస్తూ దవ్వాగవ్వులకి జరిగిపోయే చీకటి చీర చెంగు దొంగపుద్యుకుని వెలుగు వరాగా లాక్కుంటే ఆకాశం ముసిముసిగా నవ్వుతోంది!

చైత్ర శుద్ధ పాడ్యమి.

తెల తెలవారుతోంది.

కొత్తగాలులు రివ్వున వీస్తూ విశ్వాన్ని పరామర్శించాయి. ఆ శుభోదయ సుందర దృశ్యాన్ని వేడుకగా చూస్తూ పులకించిపోయాడు విశ్వం. వెదకవించి ప్రసరించే అరుణ కాంతికి కొండల అంచులు గీతలు గీసినట్టు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆకాశమార్గాన పక్షులు స్వేచ్ఛగా కలకల గానం చేస్తూ బారులు బారులుగా సాగిపోతున్నాయి. దూరంలో పసుగణాలు తీరికగా పచ్చిక మేస్తున్నాయి. ఆ పరిసరాలు చూడగానే విశ్వానికి ప్రాణం లేచివచ్చినట్టయింది. ఆ ప్రాంతాలలో తనెప్పుడూ సంచరించలేదు, నిజమే. కాని ఆ చిరపరిచిత దృశ్యాలన్నీ ఏదో ఆత్మీయతని జ్ఞాపకం చేస్తుంటాయి ఎప్పుడూ. అక్కడే రైలు దిగి ఆ ప్రదేశమంతా కాలినడకన తిరగాలని తన కెన్నోసార్లు అనిపించింది. కాని ఇప్పటివరకూ అది కోరికగానే నిలిచిపోయింది. మనుష్యుల కోరికలు కొన్ని ఎంత చిన్నవైనా ఎప్పుడూ కోరికలుగానే నిలిచిపోతూంటాయి. సముద్రస్నానం చెయ్యాలని తనకి ఎన్నోసార్లనిపించింది. వాల్తేరులో మూడు సంవత్సరాలు గడిపినా, చివరికి ఆ కోరిక తీర్చుకోకుండానే ఆ ఊరు విడిచి వచ్చేస్తున్నాడు.

రంయిమని వీచినగాలికి ఇంజన్‌లోంచివచ్చిన నుసిరవ్వ విశ్వం కంట్లో పడ్డది. చిటాలున తల వెనక్కి లాక్కుని చేతి రుమాలుతో ఎలాగో అవస్థపడి దానిని తీసివేశాడు. కాని కన్ను ఎర్రబడ్డది. అప్రయత్నంగా ఎదురుగా వున్న సీటువైపు చూశాడు విశ్వం. ఆ అమ్మాయి ఇంకా అలాగే తూర్పుని నిశ్చలంగా కిటికీలోంచి బయటికి చూస్తూనే ఉంది. తన అవస్థ ఆమె చూసేవుంటుంది. అయినా తల లోపలికి తీసుకోదేం? తన ఉనికి గుర్తించటం ఆమె కేమాత్రం ఇష్టం వున్నట్టు లేదు. ఇంతకీ, స్వాభిమానమైతే గాని ఏ విషయమూ మనుష్యులు గ్రహించరు. అందుకు కారణం ఒకప్పుడు నిర్లక్ష్యమూ, ఇంకోసారి అహంకారమూను. పాపం, ఆమె కంట్లో పడితే అవస్థపడుతుంది కాబోలు. ఆడవాళ్లు ఎంతసేపటికీ పైకి దాబు వరకే గాని ఎంత చిన్న ఉపద్రవం జరిగినా ఇట్టే బయటపడిపోతారు. అయినా, ఈ అమ్మాయికి కొంచెం కష్టం ఎక్కువలా ఉంది. రాజమండ్రినించీ చూస్తున్నాడు. ఒంటరిగా అర్ధరాత్రి రాజమండ్రిలో ఈవిడ రైలెక్కటం ఆశ్చర్యంగానే ఉంది. ఎవరో స్నేహితురాండ్రు మొదలైనవాళ్లు స్టేషన్‌కి వచ్చి సాగనంపి వెళ్లారు. అప్పటినించీ ఆమె మౌనంగా అలాగే తూర్పుని ఉంది. ఈ రైలు హిందూస్తాని యువతిలా తలమీద ఆ ముసుగెందుకూ? తన అందం కళ్ళతో తాగెయ్యటానికి ఇక్కడెవరో సిద్ధంగా వున్నట్టు!

ఈ అమ్మాయి ఎవరో గాని వేషభావాల్లో నాగరికత ఉట్టిపడుతూ వున్నా కొత్త పూర్వాచారాల ఛాదస్తం వున్నట్టుంది. గోదావరిలో డబ్బులు వేసి దణ్ణం పెట్టింది. తనకి నవ్వొచ్చింది. తను చూస్తున్నాడని సంకోచమైనా ఆమెకి కలగలేదు. ఆ అభిప్రాయం వుంటే ఓ చిన్న దొంగచూపు చూసివుండేది! అన్నట్టు ఆమె రెండుమూడుసార్లు తనవైపు చూసినట్టు అనుమానంగా ఉంది. తన తోలునంచీ పైనమాత్రం తిప్పకుండా చూసింది. బహుశా దానిమీద తన అడ్రసు వుండి వుంటుందనుకుందేమో! అంత తెలుసుకోవాలని

ఉంటే తనని అడగకూడదూ? పలకరిస్తే నోటిముత్యాలు రాలిపోతాయా కాబోలు. ఎక్కడికి వెళుతుందో ఏమో! ఒకవేళ విజయవాడలో దిగిపోతుందేమో!

ఈ ఆలోచనరాగానే మళ్ళీ కిటికీలోంచి బయటికి చూశాడు విశ్వం. జనతా ఎక్స్‌ప్రెస్ విజయవాడ సమీపిస్తోంది. కందా ఇంజన్ గావుకేక పెట్టింది. తను గుంటూరుదగ్గర్నుంచీలోకి కూరాలి చేతి గడియారం చూసుకుని, లేచినుంచుని సామాన్లు సర్దుకోసాగాడు విశ్వం. తోలుసంచీ తియ్యబోయి అప్రయత్నంగా ఆమెవైపు చూశాడు. అతను ఆమె యథాలాపంగా తన సామాన్లవైపు చూసింది. ఒక్క క్షణం విశ్వంలో ఏదో బలహీనత ఆవరించి తన అడ్రస్ ఆమెకి కనిపించేలా ఆ సంచీ తిప్పాలని అనుకున్నాడు. కాని వెంటనే ఆ ఊహకి సిగ్గుపడ్డాడు. తనెందుకు ఆమెని గురించి అంతసేపు ఆలోచించాడు? తనెవరు, ఆమె ఎవరు? ఆమెని మళ్ళీ తన జీవితంలో ఎప్పుడూ చూడటం తటస్థించకపోవచ్చు. పైగా ఆమె తనకి స్నేహితురాలేమీ కాదు. ఆమెతో ఒక్కమాట కూడా మాట్లాడలేదు. రాజమండ్రినించి కలిసి ప్రయాణం చేశారు, నిజమే అయినా ఆమెని గురించి ఏ విషయమూ తనకి తెలియదు. తనని గురించి ఆమెకీ తెలియదు. ఆమె తనని గురించి ఏమైనా అనుకుందో, లేదో! అనుకునే ఉంటుంది. తను ఏదేదో అనుకున్నాడు. ఆమె మాత్రం ఎందుకనుకోకూడదు! చిత్రం, ఇంతసేపు ప్రయాణంచేసే మనసులో అనుకోటాలతో కదిలిపోతున్నారు తనూ, ఆమే. తోటి ప్రయాణీకులతో మాట్లాడకుండా దూర ప్రయాణాలు చేసిన రోజులున్నాయి — భాష తెలియనందువల్ల. ఆ వ్యక్తి తెలుగువాడైనా, మగవాడైతే తను మాట్లాడకుండా వుండడు. కాని 'ఆమె' ఐపోయింది ఆ వ్యక్తి!

ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫారం సమీపిస్తోంది. ఆమె ఏమిటో పర్సు వెతుకుతున్నట్టుంది. సామాన్లు ఏమీ లేవు. ఒక చిన్న చేతిసంచి మాత్రం ఉంది. వెనక్కి తిరిగి చూడాలనిపించింది విశ్వానికి. కాని సాహసం చాలలేదు. ఒకవేళ అదే సమయంలో ఆమెకూడా తనవైపు చూస్తే!

"టిక్కెట్టు పోయిందండీ"

ఆందోళన వ్యక్తమయ్యే సన్నని స్వరం వినిపించింది. విశ్వం గుండె కొట్టుకోవటం స్పష్టంగా విన్నాడు. వెనక్కి తిరిగాడు. కాని ఆమెవైపు చూడటానికి బిడియపడ్డాడు.

"ఎలాగండీ?"

ఏం చెప్పాలో విశ్వానికి తెలియలేదు.

"ఎలా పోయింది!" ప్రయత్నించి అడిగాడు.

"ఏమో. చేతి సంచీలో పెట్టుకున్నాను. కిందపడి పోయిందేమో!"

విశ్వం చుట్టుపక్కల చూశాడు. ఏమీ కనిపించలేదు. ఆమె గాభరా పడుతోంది. అతనికి కొంచెం చిరాకు వేసింది. ఆడవాళ్లు జాగ్రత్త మనుషులని తను ఇప్పటిదాకా అనుకున్నాడు.

"బయటపడిపోయి ఉంటుంది. ఎలాగండీ?" అందామె.

"టి. సి. తో చెప్పండి" అందామనుకున్నాడు. కాని జాలివేసింది. ఇదికాక తనేమీ చెయ్యలేకపోతే వొట్టి అప్రయోజకుడనుకొంటుందేమో. మళ్ళీ మొగం ఎరగని మనిషే అయినా ఆమె తనని గురించి అలా అనుకోటం ఇష్టంలేదు.

"పోనీలెండి, పోయినా ఫరవాలేదు. ఇంకో టిక్కెట్టు తెచ్చిపెడతాను. ఎక్కడిదాకా వెళ్లాలి?" అడిగాడు ధైర్యం చెబుతున్నట్లు.

"విజయవాడలో దిగిపోతానండీ" ఆలోచించాడు విశ్వం. కేపటో ఎక్స్‌ప్రెస్ ఆగింది.

"టికెట్ నెంబరు తెలుసా?"

"ఉహుఁ"

ఇంత అజాగ్రత్త మనిషికి పరాకేమిటి? తనెప్పుడూ టికెట్ కాదుగదా, ఇంకేదీకూడా పారేసుకోలేదు. అయినా, టికెట్ కొనగానే నెంబరు చూసి గుర్తు పెట్టుకోటం తనకి అలవాటు.

"ఇప్పుడే వస్తానుండండి! అనేసి, రైలుదిగి వెనకసాగాడు విశ్వం. గార్డు కనిపించాడు. అతనితో చెబుదామనుకున్నాడు విశ్వం. కాని ఏం లాభం? ఎక్సెస్ కట్టుకోవాలిసిందే నంటాడు. ఆమె దగ్గిర డబ్బుందో, లేదో. అబ్బ, సమస్యలు తెచ్చిపెట్టటం ఈ ఆడవాళ్ల నైజం. విసుగ్గా ప్లాట్‌ఫారం చివరిదాకా ఓ మారు తిరిగాడు విశ్వం. చప్పున అతనిలో ఊహ తట్టింది. గబగబ బుకింగ్ ఆఫీసు దగ్గిరికి వెళ్ళి ఓ ప్లాట్‌ఫారం టికెట్ తీసుకుని వెనక్కి వచ్చాడు. కిటికీ

# అంతర్వాహిని

చదువుకున్నప్పుడు — అంటే అయినోళ్ళకింకేటిమాట— మామయ్యగారింటికి వెళ్ళేవాడు అప్పటినించీ ఆ వారింట తోట అప్పుడప్పుడు జ్ఞాపకం వొస్తూనే ఉంటుంది తనకి పాపం, ఈ సారి కూడా తనని వచ్చి రెండు రోజులుండిపొమ్మని ఉత్తరం రాశాడు మామయ్య ఏమిటో ఆ పల్లెటూరు వెళ్ళి ఉంటే తనకెంత ఇష్టం లేదు పైగా అదో యాతన ప్రయాణం చేయాల్సివచ్చేది బస్సులో రాదలుచుకుంటే అక్కడ దిగింది డొంకదారిన ఏడు మైళ్ళన్నరో రెండు మైళ్ళో నడవాలి ఈ మధ్య మోటార్లు పడ్డాయని మామయ్య రాశాడు అయినా బద్ద కిస్తూనే ఉన్నాడు ఇప్పటికింకా, పైగా వాళ్ళకి కూడా అంత ఇష్టం లేదు "అదా, ఏముందిలేదూ అక్కడ?" అంటాడు అమ్మ అప్పుడప్పుడు ఓసారి వెళ్ళిరమ్మని అంటూ ఉంటుంది. ఇంకోటి రఘు మాసంలో పద్మ పెళ్ళికి మామయ్య వచ్చినప్పుడు విషయం చెప్పిపోయాడు — అవన్నీ చదువుతో తనకి ధూమ్యాలోచాలు అంటటంలేదుట! ఓ సారి వెళ్ళి రావాలని అనుకున్నాడు విశ్వం అలా అనుకో గానే "ఎప్పుడు?" అనే ప్రశ్న ఉదయించింది. ఎలాగూ విజయదశమి శెలవులు ఇస్తారు, ఇప్పుడే ఆ ముక్కడతో తీర్చుకుంటే బావుంటుందనిపించింది అతనికి ఏదైనా అనుకుంటే అది చేసేదా దాకా తోచదు విశ్వానికి వెంటనే ప్యాకర్ని పిల్చి సామాను పట్టించమని సైకిల్ బయటికితెచ్చి, జట్కా తీసుకుని ఆనందవిలాస్ —బోర్డింగ్ అండ్ లాడ్జింగ్ హౌస్ —కివెళ్ళి ఓగది అద్దెకి తీసుకుని సామాన్లు అక్కడ పడేసి బస్‌స్టాండ్‌కి వెళ్ళాడు రాగానే వెళ్ళే బస్సులు అప్పటికే రెండు వెళ్ళిపోయాయి అని తెలుసుకుని ఓపిగ్గా బస్సుకోసం కాచుకుని కూర్చు న్నాడు అసలే బస్సు ప్రయాణాలు అతనికి తలనొప్పి పైగా తను వెళ్ళేదేమో కంకర రోడ్డు అంతంత మాత్ర మైనది. ఈ మధ్యనే సంపాదకులకు లేఖల శీర్షికలో విజ్ఞప్తులూ, ఆక్షేపణలూ రావటం గోడుని ప్రజా నీకం దృష్టికి తెచ్చాయి ఎలాగైతేనేం, బస్సొంట బస్తది. విశ్వంలాగే మరికొంతమంది పల్లెటూళ్ళలో పని వున్న జనం బస్సుకోసం ఎగబడ్డారు, చేతిలో ఓచిన్న సంచీమాత్రమే ఉండటంవల్ల విశ్వం జనాన్ని తోసు కుని ఫ్రంట్‌సీట్‌లో స్థలం సంపాదించుకున్నాడు, కొంచెం తేలిగ్గానే కుదురుగా కూర్చున్న విశ్వానికి ఆతృతంలో ఆశాభావంమీద కొంచెం సహృదయం కలి గింది. జీవితంలో ఎన్నిటికోసమో ఆగాలి చివరి దాకా ఆగే ఓపికవున్న వాడికే ఫలితం దక్కుతుంది మొదటిపాఠం నేర్చుకున్న విద్యార్థిలా విశ్వం మెరిసే కళ్ళతో జనంవైపు చూశాడు అయితే అతని సంతోషం ఎంతోసేపు ఉండలేదు బస్సు కదలబోయే సమయానికి పోలీస్ ఇన్‌స్పెక్టర్‌గారు అల్లంత దూరంలో కనిపించగా పక్కనవున్న కానిస్టేబిల్ బస్సు కండక్టర్‌కి దూరంనించే సంజ్ఞ చేశాడు బస్సు ప్రయాణీకులు కొందరు విశ్వంవైపు జాలిగా చూశారు కండక్టరు విశ్వం దగ్గరికొచ్చి బతిమాలుతున్నట్టుగా అన్నాడు

"సార్, ఈసీట్ ఇన్‌స్పెక్టర్‌గారికి రిజర్వ్ చేశాం దయచేసి ఇలా కూర్చుంటారా?" అని వెనక వైపు ఓ చిన్న భాగం చూపించాడు విశ్వానికి ఒళ్ళు మండింది

"రిజర్వ్ చేస్తే ముందు చెప్పక పోయారా?" అన్నాడు

కండక్టర అతనిమాట వినిపించుకోలేదు టికెట్ తప్పనిసరిగా వెళ్ళిపోయాడు

"సార్" అని కొంచెం జాలిగా అన్నాడు డ్రైవర్ ఇన్‌స్పెక్టర్ బస్సుకి కొంచెం దూరంలో నిల బడాడు విశ్వానికి ఏం చేయటానికీ తోచలేదు ఇన్‌స్పెక్టర్ వొస్తాడని బస్సువాళ్ళకి ముందు తెలిదన్నమాట స్పష్టం రిజర్వేషన్‌మాట శుద్ధ అబద్ధం అగ నిజమైతే మొదటనే తనని స్థలంలోకి రానిచ్చేవాళ్ళు కాదు కాని ఇప్పుడేం చెయ్యటం? ఈ గొడవలు తనకి తెలిసినవే సిటీబస్ సర్వీసు ప్రయాణాల్లో అనుభవించినవే పేచీ పెట్టు కోటంవల్ల లాభంలేదు చిరాగ్గా లేచి బస్సు వెనక సీటులో కూర్చున్నాడు తాత్కాలికోల్లో తాత్కా లికం బస్సులో ఫ్రంట్‌సీట్ ఏ తుచ్ఛాన అయినా ఖాళీ చెయ్యమని నోటీసు ఇవొచ్చు అధికారాన్ని అన హ్యించుకునే విశ్వం ఆ తుచ్ఛాన అధికారం హస్త గతం చేసుకుని విజయంతో గర్వించాలని జీవితంలో మొట్టమొదటిసారిగా అనుకున్నాడు అయితే అలా అనుకున్నందుకు అతను వెంటనే విచారించక పోలేదు. ఇంత చిన్న చిన్న పరీక్షలకే తను తట్టుకోలేక లొంగి

మనోహరాలూ, కవితా ధోరణులూ, కృత్రిమ నాగరికాలూ, కావ్యాలలో ప్రమదద్భుతమైన చెందనికి పిట్లూ, కదిలిపోూ సంగీతం, తూగులాడూ కిరణా లైల్లు లాగా అతని మనోవీధిలో అవతరించి అంతరించాయి ఎన్నాళ్ళో! తను ప్రకృతి ముగ్ధత ఒంటరిగా తన్మయత్వంతో విలపించలేదు! ప్రకృతిసౌందర్యం వర్తించినకొద్దీ హృదయపు సౌందర్యం పెంపొందుతుంది. మానవుడి నిసర్గమైన ప్రేమ. ఆ సహజమైన సహజ ప్రకృతిలో భాసిస్తుంది. కృత్రిమ వాతావరణంలో నివురుగప్పిన నిప్పులా అంతర్గతంగా వెలుగుతూ ఉంటుంది విశ్వం గట్టిగా ఊపిరి పీల్చి వొదిలాడు. ఏదో బరువు తన మీద నించి తొలగినట్టుగా ఉంది. తనేదో సత్యం కనుక్కున్నాడు. ఏదో చీకటి తెర తొలగిపోయినట్టయింది. తనంతకు ముందు తెరలు తొలగించి వస్తే తన మనసుని ఆవరించిన నీలితెరలు తను ఒక్కొక్కటే తొలగించుకుంటున్నాడు ఇప్పటికైనా తను మానవుణ్ణి గ్రహిస్తున్నాడు విషాద ఛాయలమైన అతని దర్శనం విరమిస్తున్నాడు అసౌందర్యం లోకం అంటరాని చెయ్యగలిగినదే కార్యకారణాలు అర్థం చేసుకోటంలోనే విజ్ఞత ఉంది

ఆలోచిస్తూ నడుస్తున్న విశ్వం మనసులో ఓ సందేహం కలిగింది వసంత కోకిల హృదయం ప్రఫుల్లితమై ఉదాత్తమౌతుంది నిజం. కాని హేమంతంలో

విశ్వం ఛాయావీధిలో మెరుపు మెరిసింది ప్రకృతి సౌందర్యము జగానికి నవము తను విస్మరిస్తున్నాడు ఎంపైరు పుల్లో, తొలకరిమబ్బుల్లో, తెలిమబ్బుల్లో, మంచుతెరలో అందాలు తొలకసలాడవా? సౌందర్యం ప్రకృతి సహజం ప్రేమ మానవునికి సహజం ఇవి రెండూ మానవునికే ఇతరేతరాశ్రితాలు విభజించిన మన్ను తను ప్రకృతికీ, మనిషికీ అవినాభావ సంబంధం కల్పిస్తున్నాడు తనకు తెలిసిన అనేక విషయాల్లో ఇది సరిక్రొత్తది. ఇది కొత్త సంగతేమీ కాదు. కాని తను ఈ కోణంలో అనుభవ పూర్వకంగా తెలుసుకుంటున్నాడు. భావనే బతుకుగా చేసుకున్న కళారాధకులు ఈ సత్యాన్ని అనుభూతి పొంది ఉంటారు. తను కళారాధకుడు కాదేమో కాని కళాభిరుచి కలవాడే! సర్వత్రా సౌందర్యాన్ని దర్శించగలడా!

తను అనుకోకుండానే పెద్ద ప్రశ్న వేసుకున్నాడు సర్వత్రా సౌందర్య దర్శనం! అన్ని చోట్లా, అన్నిటిలో సౌందర్యం చూడగలవాడు ధన్యుడే అది ఆదర్శం రససిద్ధుల కది సాధ్యమేమో. తనలాంటి సామాన్యమానవునికి సంగతేమిటి? వస్తుతః అస్థిర హృదయులై తే అప్రయత్నంగానే రసానందనం పొంది జీవితంలో పూలబాటలు పరచుకుని సౌందర్యంగా ఇతరులకి ఆతిథ్యమిచ్చి జీవితసౌఖ్యం పంచుకుంటారు కాని ఈ కోణాల్లో ఆంతరంగికమైన ఎంతముంది?

ఏ మామిడికొమ్మమీదనించో కోయిల కుహూమంది.

ఆ మధుర సంగీతం విశ్వం ఆలోచనల్ని పారద్రోలింది. ఆ సంగీతం వినిపించినప్పుడు తలెత్తి చూశాడతను

మళ్ళీ కొమ్మమీద కోయిల కుహూమంది. పరవశించాడు విశ్వం ఆ సంతోషంలో కొంటెంగా తను కూడా 'కో' అన్నాడు

ఎవరో రైతు కావిడితో విశ్వం పక్కనుంచి వెళుతూ "ముంగేటూగా?" అన్నాడు

అంతలో ఏదో ఎగతాళి గోచరించింది విశ్వానికి "ఈ ఊళ్ళే" అన్నాడు వెక్కిరించినట్టు ఆ రైతు కొంచెం వింతగా చూసి ఏమో అనబోయాడు. విశ్వం నవ్వు చెయ్యకుండా ముందుకి వెళ్ళాడు మనసులంలో నే తను అలా అన్నందుకు అతను విచారించాడు అలా అనటం పల్లెలో రివాజే తను అనవసరంగా తొందరపడి అపార్థం చేసుకుని అగౌరవంగా సమాధానం చెప్పాడు. తరుచు మనుషుల లోపాలే వాళ్ళ అపార్థాలకి కారణాలు. ఇతర్ల కర్తిమీద తను లోపాల ఫలితాలు రుద్దటం ఘోరం విశ్వం తన ప్రవర్తనకి సిగ్గుపడ్డాడు.

రోడ్డుమలుపు తిరిగేసరికి బాటమీద కొంచెం దూరంలో ఏదో పనిలో నిమగ్నులైన జనం కనిపించారు. మరి కొంచెం దగ్గిరికి వొచ్చేసరికి వాళ్ళంతా రోడ్డుమీద కంకర వేసే పనిలో ఉన్నారని గ్రహించాడు విశ్వం అతనికి కొంచెం ఆశ్చర్యం వేసింది. వాళ్లెవరూ పొటకజనంలా లేరు. అందరూ యువకులు. విద్యార్థుల్లా కనిపిస్తున్నారు. పూర్తిగా దగ్గిర

కొత్తవారికి విద్యార్థులకి అసలు సంగతి తెలిసింది. వాళ్లందరూ కాలేజీ విద్యార్థులు కాలేజీ సాంఘిక సేవా సమితి సేవక శిబిరం ఈసారి ఈ ఊళ్ళో జరగనున్నమాట. విశ్వం వినోదంగా కొద్దిసేపు విద్యార్థుల కార్యక్రమం చూస్తూ నిలబడ్డాడు ఇంతలో ఆ శిబిరం నిర్వహించే కాలేజీ అధ్యాపకుడు అటు వైపుకి వచ్చాడు. విశ్వం అతనికి పాత విద్యార్థి 'నమస్కారం మాస్టారూ!' అన్నాడు విశ్వం

"ఏమోయ్, ఇలా వచ్చావు, ఏంచేస్తున్నావిప్పుడు?" అడిగాడాయన

"ఎకనమిక్స్ ఆనర్స్ పరీక్షకి వెళ్లానండి"

"అలాగా బాగా రాశావా?"

"బాగానే రాశానండి."

"సంతోషం. ఇలా వొస్తున్నావేమిటి కథ?"

తన మేనమామగారు అక్కడనీ, చుట్టపు చూపుగా చూసిపోటానికి వచ్చాననీ చెప్పాడు విశ్వం ఆ అధ్యాపకుడు కొంచెం దమ్ముతీసుకొని అన్నాడు

"అయితే నువ్వు ఒకవిధంగా ఈ ఊరివాడివే మరి మా ఊరివారిలో నువ్వు లేకుండా ఎలా? శ్రమదానం చేసితీరాలిసిందే!" అన్నాడు.

విశ్వం చిరునవ్వు నవ్వాడు. తను ఆ కాలేజీలో చదివినప్పుడు ఇటువంటి కార్యక్రమాల్లో కొన్ని పాల్గొన్నాడు మాస్టారుగారు తనని ప్రత్యేకించి ఆ జ్ఞాపకంతోనే బలవంతం పెడుతున్నారని తనకి తెలుసు

"ఏమిటోయ్ తటపటాయిస్తావు అదిగో, ఆ పార పుచ్చుకో పద నేనూ వొస్తున్నాను" అని హుషారిచ్చాడు అధ్యాపకుడు ఆయనమీద గౌరవంవల్లనైతేనేం, ఆ సమయంలో తనకీ ఉత్సాహం కలగటం వల్లనైతేనేం విశ్వం రంగంలోకి దూకాడు.

ఉదయం సుమారు తొమ్మిదిన్నర గంటలు కావస్తోంది. అలిసిపోయాడు విశ్వం. పార పక్కన పడేసి తన వేషం చూసుకుని అదిరిపోయాడు తెల్లటిషర్టూ, ట్రౌజరూ ఎర్రగా ఐపోయాయి. నలిగిపోయాయి. ఈ అవతారంలో మామయ్యగారింటికి వెళ్టం ఎలా? తనకి ముందుమాత్రం బొత్తిగా తప్పదు. తనని చూడగానే మామయ్య "ఎవరోయ్, గ్యాంగ్ కూలీవా?" అనడూ గనా! ఏంచేయటం? ఆ స్థలంలో గానీ, ఇంకెక్కడగానీ ఇంటికి వెళ్ళేలోపున బట్టలు మార్చుకోటం అసంభవం.

"ఏమోయ్, వడిశావేమిటి?" అన్నాడు అధ్యాపకుడు.

"అవునండి"

"అలసిపోయావు వెళ్లు మళ్ళీ కలుస్తావుకదూ విష్ యూ గుడ్ లక్" అన్నాడాయన.

విశ్వం శెలవు తీసుకుని కాళ్ళీడ్చుకుంటూ తల వొంచుకుని ఇల్లు చేరుకున్నాడు. మామయ్య ఇల్లు తనకి బాగా గుర్తే పెద్ద మర్రిచెట్టు దాటగానే చెరువు, చెరువు పక్కనే ఉన్న పెద్ద మండువాఇల్లు. అదే ఆయన నివాసం

సంకోచిస్తూ ఓరగా వేసి వున్న తలుపు నెట్టి లోపలికి ప్రవేశించాడు విశ్వం పెద్ద ఆవరణా, బాదం చెట్టూ, పూలమొక్కలూ, ఓమూల గొడ్లపాకా అన్నీ తనకి బాగానే జ్ఞాపకం ఉన్నాయి.

గొడ్లపాకదగ్గర చేరి పరిశీలిస్తూ బట్టలకంటిన గడ్డి పరకలు దులుపుకుంటున్న వెంకట్రామయ్యగారు తలుపు చప్పుడు విని తలెత్తిచూసి కేకేశారు.

"ఎవరోయ్ అది?"

గోనెకి పిడకలు కొడుతూ ఆ కేక విని సీతమ్మగారు వెనక్కి తిరిగి విశ్వంవైపు ప్రశ్నార్థకంగా చూసింది

పెరటిదిక్కున ఒకమూల బావిపట్టా మీద బట్టలు జాడించుకుంటున్న అమ్మాయి, జానకి, ముంగురులు వెనక్కి తోసుకుంటూ, స్వేదబిందువులు తుడుచుకుంటూ పక్కకి తిరిగిచూసింది.

పలుగు నేలమీద పొడుచుకుంటూ, ఎగకట్టిన పంచెతో పెరట్లోంచి అప్పుడే వొస్తున్న సూరి విశ్వం వైపు పరకాయించి చూశాడు.

వీళ్ళందర్నీ చూసి విశ్వం చిరునవ్వు తెచ్చుకుని పెదిమలు కదిలించబోయే లోపుగా వెంకట్రామయ్యగారే కేకేశారు.

"ఓరి నువ్వట్రా" మన విశ్వమేనట్రా, అలా చూస్తారేం?"

"అంతా బాగున్నారా బాబూ?" అంది సీతమ్మ

"ఏమిటి మామయ్యా విశేషాలు ?"

వెంకట్రామయ్యగారు తలెత్తి చూసి "మాగ్సోరా" అన్నాడు.

ఇంతలో పిన్నిగారు వచ్చి బాదంఆకు ఒకటి అందిస్తూ, "ఇదిగో కొంచెం నోట్లో వేసుకో నాయనా" అంది

"ఏమిటత్తయ్యా ఇది ?"

"ఉగాది పచ్చడి."

విశ్వం మాటామాట్లాడకుండా రుచిచూశాడు

"కొత్తసంవత్సరం నీకు బాగా యోగిస్తుంది లేవోయ్" అన్నారు వెంకట్రామయ్యగారు

"మా అందరికీ కూడా" అన్నాడు విశ్వం

అప్పుడేవొస్తున్న సూరి అందుకున్నాడు "మా సంగతేమిటి లే, నీకు మంచి గిరాకీ తగులుతుంది సంవత్సరం పొడుగునా సాంఘిక సేవ చేస్తూనే ఉంటావులే"

నవ్వాడు విశ్వం

ఏడాదికి తొలిరోజున తొలిఘడియలు సంతృప్తికరంగానే గడిచాయి తనకి ఈ కొత్తసంవత్సరం పాతబోయేసరికి తన జీవితంలో ఏ యే మార్పులు జరుగుతాయో! తీపి, చేదు, వగరు, పులుపుల మిశ్రమమే జీవితం అని ఉగాది పచ్చడి హెచ్చరిక చేసింది. అందులో లేనిది ఆ రోజటి కొత్త ఫలపుష్పాల జీవితపు కొత్త అనుభవాల సంపుటికి ప్రారంభోత్సవం చేశాయి

## 2

భోజనానంతరం కాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకుని మంచంమీద వెన్ను వాల్చగానే తనకు తెలియకుండానే కునుకు పట్టింది విశ్వానికి లేచి చూస్తే సూర్యుడు పడమటికి తిరిగి ఉన్నాడు. రిస్ట్‌వాచి చూసుకున్నాడతను అప్పుడే నాలుగు దాటింది. అంతా పనులమీద ఉన్నట్టున్నారు. దగ్గర ఎవరూ లేరు. కొంచెం దూరంలో పాలేరు వెంకన్నమాత్రం కొబ్బరికాయల పీచు తీసే పనిలో నిమగ్నుడై వున్నాడు. అతనిని చూడగానే విశ్వానికి జ్ఞాపకం వచ్చింది పండగపూట కూడా అతనికి పని తప్పదల్లే ఉంది

విశ్వం నిద్ర లేవటం వెంకన్న చూశాడు.

"ఏం బాబూ లేచారా ?" పలకరించాడు.

"ఊఁ" అన్నాడు విశ్వం.

వెంకన్న ఓ కొబ్బరి బొండం జరుపు చూసి చెక్కు రంధ్రం చేసి విశ్వానికిస్తూ అన్నాడు.

"దాహం పుచ్చుకోండి, బాబూ. మా చెడ్డ ఎండగా ఉంది"

విశ్వం అడ్డు చెప్పలేదు

"మన తోటలో కాయేనండి ఇయ్యాలంటే ఊళ్లో వాళ్లు ఎగబడతారనుకోండి"

మన తోట !

ఇద్దర్నీ కలిపి మాట్లాడుతున్నాడు వెంకన్న నిజానికా తోట ఇద్దరిలో ఎవరిదీ కాదు పాపం, శ్రమ చేసేది తనే కనుక అదో రకమైన తృప్తి పొందుతున్నాడు కాబోలు ఈ దేశంలో శ్రమకి ఫలితం దక్కటం అంత సులభంగా జరిగేది కాదు. సానుభూతి చూపిస్తూ అన్నాడు

"పండగనాడుకూడా పనేనటోయ్, హాయిగా విశ్రాంతి తీసుకోక?"

"పండగైతే పని చేయకూడదా బాబు? పని చెయ్యకపోతే నాకు వొళ్లు ఇరగొట్టినట్టుంటది"

"అంత చెయ్యాలని ఉంటే సొంత పనేదైనా చేసుకోకూడదూ?"

"ఇది సొంత పని కాదంటారండీ ?"

అమాయకుడల్లే ఉన్నాడు ఆంధ్రదేశం రాజకీయంగా ఎంతో ముందున్నదని తను అనుకుంటున్నాడు చైతన్యవంతమైన ప్రజ అని గర్వపడేవాడు. పీడిత శక్తుల్ని గురించి ఏమీ తెలియనట్టు మాట్లాడతాడేం ఇతను !

"నువ్వు వట్టి అమాయకుడివోయ్"

వెంకన్న చిరునవ్వు నవ్వాడు.

"అయితే ఆ తప్పు ఆసామీగారిదేనండి. అరి తోకే చెప్పండి ఆమాట"

విస్తుపోయాడు విశ్వం ఇతనేదో వ్యంగ్యగర్భితంగా మాట్లాడుతున్నాడు అతనలా అంటాడని తను ఏమాత్రం ఊహించలేదు.

"అంటే ?" అన్నాడు అర్థం కానట్టు తెలియచేస్తూ.

అప్పుడే అటువైపు వస్తున్న సూరివైపు చూపిస్తూ అన్నాడు వెంకన్న.

"ఏం? కృతజ్ఞత తెలియచెయ్యటాని కుత్తరం రాస్తావా? ఆ అమ్మాయేనా జానకి?"

తెల్లబోయాడు విశ్వం. అతని కళ్లలో ఆశ్చర్యం గోచరించింది.

"జానకా?"

"అవును. జానకి, అంటే నేను."

నవ్వింది జానకి, కొద్దిక్షణాలు ఏమీ మాట్లాడలేక పోయాడు విశ్వం

"నిజమా? నేను గుర్తుపట్టలేకపోయాను."

"అప్పటికి నువ్వు చిన్నదానివి."

"నువ్వు రాజమండ్రి ఎందుకు వెళ్లావు?"

"మనకి మా ఇంటిపక్కన ఒక డిస్ట్రిక్ట్ పంచాయతీ ఆఫీసర్ గారుండేవారు. ఆయన కూతురు నాకు ముఖ్యస్నేహితురాలు. ఆ అమ్మాయి పెళ్ళికి నన్ను తప్పక రమ్మనమని బలవంతం చేస్తే వెళ్లాను. వాళ్లు ఈమధ్యనే రాజమండ్రి బదిలీమీద వెళ్లారు."

"అలాగా ఒంటరిప్రయాణమంటే నీకు భయం లేదన్నమాట."

"భయమెందుకూ? పెద్దపులి ఎత్తుకుపోతుందా? ఇలా ఎన్నిసార్లు ఒంటరిగా వెళ్ళి రావటంలేదు!"

"టికెట్ పోతే మరి అంత గాభరాపడ్డావేం?"

జానకి సమాధానం ఇవ్వలేక చిరునవ్వు నవ్వింది.

"రైల్లో నన్ను గుర్తుపట్టావా?" అనుమానంగా అడిగాడు విశ్వం

"అనుమానించాను."

"నేను చాలా మారానని అందరూ అంటారే!"

"పోలికలు ఎక్కడికి పోతాయి?"

కొంచెం చిలిపిగా విశ్వం ముక్కుకేసి చూసిం దామె

"నాది గరుత్మంతుడి ముక్కు కదూ?" నవ్వుతూ అన్నాడు విశ్వం. జానకి చిన్నప్పుడు తనని అలాగే వేళాకోళం చేసేది.

'అని నేను అనేదాన్ని!' ముసిముసిగా నవ్వింది జానకి.

"నేనుమాత్రం నిన్ను గుర్తుపట్టలేకపోయాను."

"మగవాళ్లకి మతిమరుపెక్కువ."

"అనుమానం తీరడానికి పలకరిస్తే తెలిసిపోయేదిగా?"

"ఒకవేళ నువ్వు కాకపోతే?"

"ఏం కాకపోతే, ఇంతలోకే కొంపలంటుకుంటాయా?"

సమాధానం అనవసరం అన్నట్టుగా జానకి ఊరుకుంది

"సమయానికి నేనున్నాను కనుక సరిపోయింది గాని లేకపోతే అవస్థపడేదానివే."

"అప్పుడు టికెట్ పోయేది కాదులే."

"అన్నీ మన ఇష్టప్రకారం జరుగుతాయా?"

"నువ్వున్నావు కనుకే టికెట్ పోయిందేమో."

"అదేమిటి?"

"లేకపోతే నువ్వు హోల్డాల్‌మీద రాసుకున్న నీపేరూ, లెదర్ బ్యాగ్ మీద రాసుకున్న అడ్రసు చూడటానికి వీలు అయేది కాదుగా."

వింతగా చూశాడు విశ్వం అనుమానిస్తూ అన్నాడు "అయితే అంతా నాటకమేనా?" విస్మయం అతని ముఖంలో తాండవించింది. జానకి చిరునవ్వు నవ్వింది-దాంతో అతని అనుమానం రూఢిఅయింది

"నువ్వు అబద్ధాలు చెప్పుతావుగా" అన్నాడు విశ్వం కొంచెం కోపంగా

"ఏం, గుంజీలు తియ్యాలా!"

ఆ మాటల్లో ఏదో వ్యంగ్యం ఉంది. తటుక్కున విశ్వం స్మృతిపథంలో ఒకదృశ్యం మెదిలింది. పూర్వం ఓసందర్భంలో జానకి అబద్ధం చెప్పిందని "అబద్ధమాడరాదు" అనిపిస్తూ ఆ పిల్లచేత వరసగా కొన్నిసార్లు చెప్పిస్తూ గుంజీలు తీయించాడు

"అబద్ధమా?" అని రైల్లో జానకి అన్నమాటలో అదే చిలిపితనంతో కూడిన ఎత్తిపొడుపు విస్తుపోయాడతను. చాదస్తురాలు, అమాయకురాలు అనుకొన్న జానకిలో ఇంత గడుసుతనం ఉందనుకోలేదు

"ఏమిటి బావా! ఆలోచిస్తున్నావు?" అంది జానకి

"ఏంలేదులే" అన్నాడు.

"నిజంగా సుళ్ళోకి వెళ్లాలా?"

"ఊఁహుఁ."

"అయితే యిక్కడికెందుకు వచ్చారు, మరి?"

"మూర్తి ఇక్కడ ఉంటానన్నాడు ఇప్పుడే వస్తానన్నాడు. ఇంకా రాలేదే, పోదామా?"

"పద."

దారితీసింది జానకి. తనని గుళ్లోకి వెళ్ళమని బలవంతం చేస్తుందనుకున్నాడు విశ్వం. కాని ఆమె అలా ప్రవర్తించకపోవటం అతనికి కొంచెం ఆశ్చర్యంగానే ఉంది. దేవుణ్ణిగురించి జానకితో వాదన చేసుకోవాలనిపించింది అతనికి. కాని ఆమె అందుకు అవకాశమేం ఇవ్వటంలేదు. ఇద్దరూ నడుస్తున్నారు. దారిలో మూర్తి కలిశాడు.

"పరిస్థితి అదుపులోకి వచ్చినట్టేనా?" ఆందోళనగా అడిగాడు విశ్వం.

"కొంచెం ఉద్రిక్తంగానే ఉంది వాతావరణం. కాని సద్దుమణిగిందనుకోవొచ్చులే. లోలోపల రాజుకూనే ఉంటుందనుకో."

"దెబ్బతగిలినవాడెలా ఉన్నాడు?"

"ఆస్పత్రిలో చేర్పించి వచ్చాం. అంత ప్రమాదమేం లేదు."

"ఈ ఊళ్ళో ఆస్పత్రి ఉందా?"

"ఉందిలే లోకల్ ఫండ్ డిస్పెన్సరీ."

"డాక్టరున్నాడా?"

"ప్రాణభయం ఏమీ లేదన్నాడు కాంపౌండర్."

"డాక్టర్!"

"డాక్టర్ ఈ ఊరొదిలించి బదిలీఅయి మూడు నెలలయిందిలే. ఇంకా కొత్తడాక్టరు రాలేదు."

"నిజం? విడ్డూరంగా ఉందే!"

మూర్తిహాయిగా నవ్వాడు.

"అదంతే లే. డాక్టర్లు కొరతగా ఉన్నార్లే."

కొంచెంసేపు మౌనంగా నడిచారు వాళ్ళు. మలుపు తిరగగానే కొంతమంది పిల్లలు ఏదో కొట్లాటతో అరుచుకుంటూ కనిపించారు. వాళ్ళని దగ్గరికి పిలిచి జానకి కొబ్బరి చిప్పలు ఇచ్చింది.

"[illegible] పాపం" అన్నాడు విశ్వం.

"ప్రసాదం" అంది జానకి.

"సర్వాణ్ణి మాయచేశా!" అన్నాడు. "ఏదోలే, వాళ్ళకి వాళ్ళ తృప్తి" అందామె.

ఇంచుమించు అదే సమయంలో ఓ కుంటివాడు ఎదురై "నమస్కారంబాబూ" అన్నాడు. విశ్వం ముఖం చిట్లించుకుని నుంచున్నాడు. అందుక్కారణం వాళ్ళని చూస్తే అతని కదోవిధమైన అసహ్యం కలిగేదని కాదు. కాని అతనికి మనిషిని ఆ స్థితిలో చూస్తే అతని కీ సదంతా అప్రయత్నంగా రగులుతుంది. కుంటివాడు మూర్తివైపు చూసి చెయ్యి జాపాడు.

"విచిత్రం!" అన్నాడు విశ్వం.

పర్సులోంచి చిల్లరపైసలు తీసి జానకి వాడి చేతిలో వేసింది. అతను ఏదో దీవన గొణిగి వెళ్ళిపోయాడు.

"అలవాటు చేస్తే వాళ్ళు ఈ విధంగా తయారయేది."

"పోనీలే, పాపం" అంది జానకి.

విశ్వం ఊరుకోకుండా ముష్టివాళ్ళగురించి ఓ లెక్చరు దంచేశాడు. దేశం ఇలాంటి పోకడలని సహించలేదన్నాడు. సంఘానికి ఇదో చీడపురుగులా తయారైందనీ, ముష్టి వెయ్యటం వాళ్ళనిమరింత నిష్క్రియా శీలురని చెయ్యటమేననీ ఏమేమిటో మాట్లాడాడు.

జానకీ, మూర్తీ ఏమీ మాట్లాడలేదు. విశ్వానికి కొంచెం అవమానం వేసింది. వాళ్ళు తనమాటలు వింటున్నట్టు లేదు. అంటే తనని వెర్రి వెంగళప్ప క్రింద అని కాబోలువాళ్ళ అభిప్రాయం! అభిమానం ముంచుకొచ్చి ఉపన్యాసం ముగించేస్తూ అన్నాడు.

"మీకు తెలియాలి పట్నాల్లో బిచ్చగాళ్ళది ఎంత పెద్ద సమస్యో!"

"కానివ్వూ" అన్నాడు మూర్తి. కాని జానకిమాత్రం నోరు మెదపలేదు. అలా ఊరుకోటం విశ్వానికి నచ్చలేదు. తనది తప్పో రైటో తేల్చాలనికాదు. తను అంతసేపు ఏకధాటిగా మాట్లాడినా ఆమె అలా నిర్లిప్తంగా ఉండటం తనకి కష్టంగా ఉంది. చిన్నతనం కూడా వేసింది. చూస్తే జానకి కొంచెం విచిత్ర వ్యక్తిలా ఉంది.

ఇంటికి చేరేసరికి అసుర సంధ్య వేళయింది. వీధి వాకిలి ఓరగా ఉంది. లోపలికి వెళ్ళేసరికి అరుగుమీద

"నీకు తెలియదు కదా విశ్వం మాస్టారూ"

"పొలాలు కౌలు కిచ్చేసి అందరూ ఒక చోటే ఉండొచ్చు. విశేషంగా రెండేళ్లు కాగానే ఎం ఏ ప్యాసై వస్తాడు"

"అక్కడితో అయిపోయిందేమిటి? మరొకటి చద వాలనిపించవచ్చు. చదువుకి అంతేమిటి? మన పరిస్థి తులు చూసుకోవాలి గాని"

"నీకోపం పోస్తే రావొచ్చుగాని ఈ విష యంలో నువ్వు నీ స్వార్థమే చూసుకుంటున్నావు మావయ్యా"

వెంకట్రామయ్యగారు వాడిగా అన్నారు.

"పోనీ అలాగే అనుకోండి. వాడికి అంతపట్టు దలగా ఉంటే చదవొద్దని నేనేం అనలేదే"

"అదా రాజకీయపు టెత్తు, నువ్వు మనస్ఫూర్తిగా వెళ్ళమనక పోతే వాడు వెళ్ళడు"

"నేను వాడి బాగుకోరే వాడినికాదా?

విశ్వానికి విసుగుపుట్టింది. ఊరుకోమన్నట్టు సంజ్ఞ చేశాడు సూరి

"నీ ఇష్టం" అన్నాడు విశ్వం

కొంచెం సేపు ఎవరూ మాట్లాడలేదు. మునసబు గారి బండి వేగంగా వస్తోంది. ఇద్దరు పాలేళ్ళకీ కొంచెం పోటీ పడ్డది ఎవరి ఎద్దులూ తీసిపోయినవి కావని రుజువు కావాలి. గంటల మోతలు ఎక్కువయాయి. ఎదురెదురుగా వెళ్ళే బళ్ళ మధ్యదూరం తక్కువౌతున్న కొద్దీ హోరు ఎక్కువ కాసాగింది.

బండిని బండి దాటుతోంది. ఇరుసూ ఇరుసూ ఒరు సుకుని చక్రం చక్రం ఢీకొన్నాయి. ఆగి పోయాయి బళ్లు రెండూ, ఇరుసులు తప్పించాలి వెంకన్న దిగ బోయి మళ్ళీ ఎందుకో మనసు మార్చుకుని కూర్చు న్నాడు. అవతల వ్యక్తి అలాగే చేశాడు. వాళ్ళిద్దరూ మాటామాటా అనుకున్నారు నీది తప్పంటే నీది తప్పన్నారు. ఎవరిది తప్పో తేలలేదు. ఇటువంటివి తేలేవి కూడా కావు మునసబుగారు కదల్లేదు బిగిగా కూర్చున్నారు. వెంకట్రామయ్యగారూ అంతే

"ఏమిట్రా ఈ గొడవ?" అన్నాడు విశ్వం.

సూరి వాడిగా నవ్వాడు "మంచి చెరువు విగితే వాళ్ళ అంతస్తు తక్కువ, చిక్కు!" అన్నాడు.

పాలేళ్లూ మాటలు మానుకున్నారు.

"ఇద్దరూ పొలాల్లో పనిచేసుకునే వాళ్లే ఇద్దరూ శ్రమజీవులే పొద్దున లేస్తే మొహా మొహాలు చూసు కునేవాళ్లే ఈ కీచులాట ఎందుకు?"

"అదే తమాషా వాళ్లకోసం కాదు వాళ్ల పేచీ. వాళ్ల యజమానులకోసం, యజమానుల ఘనతబట్టి తమ ఘనత కొలుచుకోటం ఇంకా పోలేదు కదా." చిన్నగా చెప్పాడు సూరి.

వెంకట్రామయ్యగారు కొంచెం ముందుకి వచ్చారు

మునసబుగారుకూడా జరిగారు పాలేళ్ల మాటల్లో యజమానులమాటలు కలిశాయి. పోరు ఘోరమయ్యే సూచన కనిపించింది.

బండిలోంచి గభాలున ఉరికాడు సూరి వెనకే విశ్వంకూడా దూకాడు.

అవతల బండిలోంచి అదే సమయంలో ఒక యువకుడు కిందికి దూకాడు ఇంచుమించుగా ఒకే సమయంలో అందరూ ఇరుసుమీద చెయ్యేశారు. బళ్లు విడిపడ్డాయి ఎవరూ ఏమీ మాట్లాడుకోలేదు. మళ్లీ బళ్లలో ఎక్కారు. క్రమ క్రమంగా బళ్ల మధ్య దూరం ఎక్కువ కాసాగింది

వెంకట్రామయ్యగారు ఓ సారి ఆకాశంలోకి చూస్తూ కొంచెం అర్ధ స్వగతంగా అన్నారు.

"నా చిన్నతనపు రోజుల్లో ఇలాగే జరిగివుంటే తలకాయలు ఎగిరేవి."

ఆలోచనలో నిమగ్నుడైవున్న విశ్వం ఆ మాటలు విని సూరివైపు కొంచెం ప్రశంసా పాత్రంగా చూశాడు. అతను నిర్లిప్తంగా శూన్యంలోకి చూడ సాగాడు

"ఆ అబ్బాయి ఎవరు?"

"మునసబుగా రబ్బాయి, పట్నంలో చదువు కుంటున్నాడు" క్లుప్తంగా చెప్పాడు సూరి.

ఆ తరవాత చాలా సేపటివరకూ ఎవరూ ఏమీ మాట్లాడలేదు. చిరుగంటల గణగణ వింటూ కూర్చుండి పోయారు

[సశేషం]

# ఆంగ్లభాషలో భారతీయ పదజాలం

శ్రీ కొండముది శ్రీరామచంద్రమూర్తి

భారత స్వాతంత్ర్య దినం నాడు ఢిల్లీలో లార్డు మౌంట్ బాటన్ మాట్లాడుతూ "భారతీయులు, ఆంగ్లేయులు కలిసి మెలిసి సంచరించిన గత కొద్ది శతాబ్దాల్లోనూ ఆంగ్లేయ జీవనవిధానము, ఆచారవ్యవహారాలు, భాష, ఇక్కడి భారతీయుల సాంగత్యం వలన ఎంతగానో మారిపోయినది—కానీ దానిని గుర్తించటం మాత్రం ఇంకా జరుగలేదు" అని అన్నారు. ఇది అక్షరాలా యదార్థం. నాలుగు వందల సంవత్సరాల క్రిందట, ఏనాడు ఆంగ్లేయులు వ్యాపారమన్న కారణంతో మన గడ్డమీద అడుగు పెట్టారో, ఆ నాటినుంచే సుదీర్ఘమైన, సుస్పష్టమైన సంబంధ బాంధవ్యాలు మనకూ వారికీ ప్రారంభమయ్యాయి. సాంఘికంగానే కాక, రాజకీయ రంగాల్లోనే కాకుండా, భాషలో కూడా ఇరుతెగలా ఎంతో మార్పు జరిగింది.

పండిట్ నెహ్రూగారో సందర్భంలో మాట్లాడుతూ "శతాబ్దాలనుంచి ఆంగ్ల భాషలో హిందూస్థానీ పదాలు ఎన్ని ప్రవేశించాయన్న విషయాలంతో కొద్ది పరిశ్రమ చేశాను కానీ ఆ మహాకార్యాన్ని చివర వరకూ కొనసాగించటం మాత్రం జరిగింది కాదు. అయినా చేసిన ఆ కొంచెం కృషిలోనే, లెక్కకు ఎక్కువగా హిందూస్థానీ పదాలు, ఆంగ్ల భాషలో కన్పించటం నాకు చాలా ఆశ్చర్యం కలిగించింది" అన్నారు. హిందూస్థానీ పదాలు మాత్రమే కాదు, ఏ మాత్రం కొద్ది పరిశ్రమ చేసినవారికైనా, భారతీయ భాషలన్నీ కూడా, కొద్దో గొప్పో, తమతమ పదాభరణాలతో ఆంగ్లభాష నలంకరించటం విస్మయం కల్గించక మానదు.

ఆంగ్లరచయితలు కూడా ఈ పరిస్థితిని గుర్తించారు. కానీ కొద్దిమంది మాత్రమే గణనీయమైన కృషి చేశారు. మరికొంతమంది తగిన కృషి చేయకుండానే, సర్వమూ తెలుసుకున్నట్లుగా ప్రవర్తించారు. కొన్ని నిఘంటువులు కూడా చేసినవారు 1 డా॥ సెరీ యూస్. సర్ జెస్పర్సన్, ఆంగ్లంలో భారతీయపదాలు మొత్తం 188 (అక్షరాలా నూటఎనభై ఎనిమిది) అన్నారు. లెక్క తేల్చారు. ఇదే గనక నిజమైతే ప్రొఫెసర్ వీక్లీ చేసిన పరిశోధన అంతా గాలిలో దీపమన్నమాట. చివరకు ఆయన 2 cod ఇచ్చిన మాటలనైనా లెక్కలోకి తీసుకోలేదు. ఆ విధంగా "బ్రాహ్మిన్, బెంగల్" మొదలైన మాటలు ఆయన లిస్టులోనుంచి జారిపోయాయి.

ఈ విధంగా భారతీయ భాషాప్రభావం మీద తగిన శ్రద్ధ లేకుండానే వ్రాసింది ఓ విద్వాంసుని వదిలివేసి 3 oed ని మనం ప్రమాణంగా తీసుకున్నట్లయితే మనకు రమారమి ఆంగ్లంలో భారతీయ పదాలు 900 వరకూ కన్పిస్తాయి. ఇవీ ఈ పదాలకు మూల్యాలా, చేర్పులా, మినహాయింపులా మరెన్నో!

అయితే మన భాషలమీద ఇంగ్లీషు ప్రభావాన్ని గనక లెక్కలోకి తీసుకున్నట్లయితే, ఆంగ్లభాషపై భారతీయ భాషాప్రభావం చాలా తక్కువే. ఒక్క తెలుగులోనే మనం అనునిత్యం మాట్లాడుతున్న మాటల్లోనే దాదాపు 3000 పదాలుంటేగా, భారతీయ భాషల పదాలన్నింటినీ కలుపుకున్నా, ఆంగ్లంలో, పైన యిచ్చిన సంఖ్యకు సగానికన్నా మించలేదు.

ఈ విధంగా, ఆంగ్ల పదాలు మన భాషల్లో విరివిగా కన్పించటానికీ, భారతీయ పదాలు ఇంగ్లీషులో తగినంత ప్రాతినిధ్యం పొందలేక పోవడానికీ ఎన్నో కారణాలున్నాయి. ఆంగ్లేయులు ఎన్నడూ కూడా ఈ దేశాన్ని తమ జన్మస్థలంగా భావించలేదు. పైగా ఇక్కడి ఆచార వ్యవహారాలు వారికి అత్యంత వ్యతిరేకం. వ్యాపారం నిమిత్తం ఈ దేశానికి వచ్చిన వారైనా తిరిగి తమ తమ జన్మస్థలాలకు వెడుతూ వస్తూ ఏవో నాలుగు మాటలు మాత్రం గ్రహించుకుని

---

1 History of Foreign words in English అన్న గ్రంథములో

2 Concise Oxford Dictionary

3. Oxford English Dictionary

పదజాలాన్ని ఏలా ఉపయోగించారో తెలుసు కుందాం

## 3

మాటలచేత మనీషులు మన్నన లందుకున్నది అన్నది ఆనాటి సంగతి అయితే, మాటల వ్యవహారం చేత, మాటలలోని మార్పులవల్ల, చరిత్రకందని కొంద రిని గురించి తెలుసుకోవచ్చునన్నది ఈనాటి విశేషం 'మాటలే' ఆర్థిక విప్లవాన్ని వివరిస్తాయి 'మాటలే' సాంఘిక స్థితిగతులను బోధిస్తాయి ఆ 'మాటలే' చిజాపు సంస్కృతినీ, నాగరికతనూ తెలియ జేస్తాయి

## 1600 నుండి 1700 వరకు

ఇంగ్లండులోకి ప్రవేశించిన భారతీయ పదాలను శతాబ్దాల వారీగా పరిశీలిస్తే ఇదే సంగతి తేటతెల్ల మౌతుంది. మొదటగా పదునేడవ శతాబ్దాన్ని పరి శీలిద్దాం

ఈ శతాబ్దంలో తీసుకున్న మాటలు పూర్తిగా వ్యాపారానికి సంబంధించినటువంటి దాదాపు అన్నీ వస్తు వుల పేర్లే ఉదా: క్యాలికో, చుద్దార్, టబ్బార్, బంగాల్ (ఇదివరలో బ౦త్రుల మొక్కలను బంగాల్ అని పిలిచేవాళ్ళు), గుంగాళి (చాలా తక్కువ రకా నికి చెందిన గుడ్డను 'గుంగాళి' అని పిలిచేవాళ్ళు ఈ గుడ్డతో గోనెసంచులు కుట్టించుకొన్నారు ఇటువంటివి ఇంకా చాలా మాటలు వున్నాయి అయితే ఈ మాటలన్నీ కూడా వాడుకలో లేకుండాపోయి, కాల గర్భంలో కలిసిపోయాయి. చివరికంటా ప్రతికి వున్న మాటల్లో 'క్యాలికో' అన్న దానికి చక్కటి చరిత్ర వుంది.

## క్యాలికో

16వ శతాబ్దంలో ఇది "కల్లికట్, కలికో" అని పిలువబడేది అటు తర్వాత పోర్చుగీసు, ఫ్రెంచి భాషల ప్రభావానికి లోనయింది. అసలు ఆ కాలంలో గోవా తర్వాత చాలా పెద్ద ఓడరేవు అయిన క్యాలికట్ నుంచీ వచ్చే తెల్లని వస్త్రానికి, దీనికి కొంత సామ్యం వుంది. ఇటువంటి, భౌగోళికమైన మాటలను వస్తువు లకు వాడుకునే సౌలభ్యాన్ని భారతదేశం ఇంగ్లాం డుకు అనేకంగా కల్పించింది. ఉదా: "డుంగార్, మారక్, బెంగాల్, మద్రాస్, మలబార్, జోధ్ పూర్, 'జాకోనెట్' " 'క్యాలికో' అన్నమాట ఎంత వాడుకలోకి వచ్చింది అంటే, తూర్పుఇండియా దిగుమతి చేసుకున్న ప్రతి మాలుకుడ్డను ఇదే పేరుతోటి పిలిచేవా రాకాలంలో పోర్చుగీసు తర్వాత, తర్వాత ఇది "చాలా చల్లని, చవకరకం బట్ట" అని పేరు సంపా దించుకొంది పోర్చుగీసుల కారకాల్లో ఒక కాల్పనికమైన "క్యాలికో హాల్" అని పేరు అక్కడ అప్పుడు నాట్యం చేసే వారందరూ కూడా మాతృకను యాత్రికు లంపుకు వచ్చేవారట! అమెరి కాలో "ముద్రింపబడిన మాదిరిబట్ట"కు క్యాలికో అని పేరు. అమెరికన్ విద్యార్థి దృష్టిలో "A choice bit of Calico" అంటే అమ్మాయి అని అర్థం ఆధునికంగా నే మార్క్ అంటే 'చాలా తక్కువ రకానికి చెందిన గుడ్డ' అన్న భావం మార్పుచెందింది

ఈ శతాబ్దానికి చెందిన వ్యాపార వస్తువుల పేర్లలో ఆగ్రా, కొయిర్, కుంకుమాగ్ (తెలుగు కుంకుమపువ్వు), పెప్పర్, షుగర్ " అన్నవి కొన్ని. పెప్పర్, షుగర్ అన్నమాటలు ఇంతకు చాలాకాలం క్రితమే, గ్రీకు, లాటిన్ల ద్వారా, ఇంగ్లండులోకి వచ్చిపోయుంటాయి

ఇటువంటివే మరికొన్ని మాటలు: "గుర్రాక్షీ, కూలీ, బజార్, గూటి, పైసా, మొహర్, పగోడా (గోల్కొండలో అప్పట్లో వాడుకలో వున్న ఒక నాణెం), దీనార్, ఫనమ్, లక్; మౌండ్, పెర్; సేర్, తుల."

ఈ శతాబ్దంలోనే మరొక్క విశేషం, 1690 కల్లా పోర్చుగీసులు వచ్చిపోయినా అంతటా స్థావరాలు ఏర్పరచుకుని బాగా స్థిరపడ్డారు. అదీగాక, భారత-పోర్చుగీస్, దేశీయుల సాహచర్యం వల్ల "ఇండో-పోర్చుగీస్" మాటలు కొన్ని పుట్టు కొచ్చాయి. ఆ తర్వాత వచ్చిన ఆంగ్లేయులకు కూడా పోర్చుగీసు వారవలంబించినపద్ధతే తప్పా అవలం బించక తప్పలేదు

డాక్టర్ జోలాడ్ అభిప్రాయం ప్రకారం ఈ సమయంలోనే 300 సుమారు పదాలు పోర్చుగీసు ద్వారా ఇంగ్లీషులోకి ప్రవేశించినవి అయితే అందులో చాలా పదాలను ఇప్పుడు కాలకు తే మహా దర్పం వినియోగించబడింది. అల్లా వినియోగించబడిన

కుండా కొనవ్యాపిరితో ప్రతికిత్తున్న పదాలలో 'తోపాసి' అన్నదొకటి. దీని అర్థం సైనికుడు గానవచ్చు లేక ఓడలో పనిచేసే పాకీవాడు కావచ్చు లేక భారతదేశంలో పోర్చుగీసువారి సంతానం కావచ్చు. ఏమైనా మన హిందూ "దుబాషీ" పదానికి, దీనికి కొంత సామ్యం వుంది. ఇంగ్లీషు - పోర్చుగీసువారు మొదట్లో ఈ దుబాషీలు (Translaters) గా పనిచేసేవారని దీన్నిబట్టి తెలుస్తోంది.

సంపూర్ణమైన చరిత్రగల మరొకమాట "ఫిరంగీ" భారతీయులు మొదట్లో పోర్చుగీసువారిని ఫిరంగీ లని పిలిచేవారు. తర్వాత తర్వాత పాశ్చాత్యులందరికీ ఈ పదమే వర్తించింది. కానీ ఈ పదం అసలు ఎలా పుట్టిందో మాత్రం ప్రశ్నార్థకంగానే వుంది. బహుశా 'ఫ్రాంక్' అన్న పదం 'వికృతి చెంది ఫిరంగీ అయిందేమో!' యూరోపు దేశీయులనందరనూ కూడా భారతీయులు మొదట్లో 'ఫ్రాంక్స్' అని పిలిచేవారు. ఎందుకంటే ఫ్రెంచివారు చేసిన యుద్ధాలే భారతీయుల స్మృతిపథంలో నిల్చిపోయి యూరోపియనులు అంటే ఫ్రెంచివారు అనే దృష్టి ఏర్పడిపోయింది. ఆ ఫ్రెంచివారే ఫ్రాంకులయి, ఆ ఫ్రాంకులే ఫిరంగీలయినారు. ఆ పిదప పోర్చుగీసువారు తమ మతవ్యాప్తికై చేసిన దుస్తంత్రాలు, గుర్తయాల మూలంగా, వారు క్రిస్టియనులు కావడంచేత, ఫిరంగీ అంటే స్థూలంగా క్రిస్టియన్ అనే అర్థం వచ్చింది. ప్రాచీన వాఙ్మయంలో 'ఫిరంగీ' అంటే "యుద్ధాల్లో తుపాకీ మందు పెట్టి కాల్చే ఒక మారణసాధనం" అనే అర్థం కూడా వుంది. "పిస్టల్, అరక్, కాయిర్, కోబ్రా" మొదలైన వన్నీ ఇటువంటి మరికొన్ని మాటలే. మాటల చేత చరిత్రను తెలుసుకోవచ్చు అన్న నిర్ణయానికి సహాయకారులు "మొగల్, మున్షీ, సుబాహ్దార్, దుబాషీ" మొదలైన పదాలు.

17 వ శతాబ్దంలో మొగలు రాజకిరీటం ధగద్ధగాయమానంగా వెలుగుతున్నది. ఆ సొగసులు, ఆ దర్బారులు, వర వైభవం, చూసివచ్చిన పాశ్చాత్యుల కళ్ళకు మిరుమిట్లు గొల్పాయి. 1586 లో ఆగ్రా చక్రవర్తి ఆస్థానానికి ఎలిజబెత్ రాణి జాన్ మ్యూల్డెరిన్ తన ప్రతినిధిగా పంపింది. అప్పుడే "మొగల్" అన్న పదం "గణనీయుడైన, స్వేచ్ఛాధికారయుతుడైన చక్రవర్తి" అన్న అర్థాన్ని సంపాయించుకుంది. "ఫర్మానా" కూడా అటువంటిదే. మొగలు సార్వభౌముల ఆస్థానానికి తెల్లవారి రాకపోకలు అభ్యంతర రహితంగా యథేచ్ఛగా సాగిపోతుండేవి. సూరత్‌లో మొట్టమొదటిసారిగా ఆంగ్లేయులు తమ ఈస్టిండియా కంపెనీని స్థాపించుకోవటానికి, వర్తకులు తమ ప్రాభవాన్ని పెంపొందించుకోవటానికి, ఉదారహృదయులైన ఆ ఢిల్లీశ్వరులు "ఫర్మానా"లు జారీ చేస్తుండేవారు.

మొదటే మనవిచేశాను. ఆంగ్లేయుల జీవన విధానానికీ, మన జీవనవిధానానికీ వారి సంస్కృతికీ మన సంస్కృతికీ హస్తిమశకాంతర భేదమున్నది. ఈ భేదాన్ని అంచెలంచెలుగా అధిగమించటానికే "దుబాషీలు, మున్షీలు, సుబాహ్దార్లు" అవసరమైనారు ఆంగ్లేయులకు. ఇటువంటిదే తెలుగుమాట "బోయి" (Boy) కూడా పల్లకీలు మోసేవారిని తెలుగులో 'బోయీ' లని పిలుస్తుంటారు. ఆ బోయీ, చివరకు బోయ్ అయింది. అర్థం మారింది. "పకీర్, జోగీ, రాజా, మహల్, పాలంక్విన్, ధోవీ, మ్యాంగో, బన్యన్, టీక్, సంబూర్, బజార్" ఇవన్నీ అప్పట్లో ఆంగ్లేయులకు ప్రీతిగా పరిచయమైన పదాలు.

ఈ పదునేడవ శతాబ్దంలో ఆంగ్లేయులు భారతీయులకు సమానప్రతిపత్తి నిచ్చి గౌరవంతో, ఆదరంతో సందర్శించారు. భారతీయ జీవనవిధానాన్ని తెలుసుకోవడానికి ఎంతో ఆసక్తి చూపించారు. హిందూమతాన్ని, హిందువుల దైవభక్తినీ ఖండించలేదు. హిందూ ముస్లిము పండుగలు—"హోలీ, దివాలీ, మొహరం, రామదాన్"—లను తాము కూడా తమ భాషలోకి చేర్చుకున్నారు. భోజనంలో వస్త్రధారణలో భారతీయుల ననుకరించారు. "బన్యన్ షర్ట్స్, లాంగ్ డ్రాయర్స్, కాంగీ కాలర్స్, బన్యన్ కోట్స్, మూర్ మెన్స్ ట్రౌజర్స్" వుండేవి ఆరోజుల్లో.

## 1700 నుండి 1800 వరకు

పదునెనిమిదవ శతాబ్దంలో ఆంగ్లంలోకి ఎక్కువగా చేరిన మాటలు క్రిందటి శతాబ్దంలో వాడక వాడకా చాలా తప్పుడు అర్థాలు తీసుకున్న మాటలకు కుదుర్పులూ, చేర్పులూ, మినహాయింపులూ చేసి అనేక క్రొత్త మాటలు సృష్టించారు. ఆ తరువాత ఈ శతాబ్దంలో, పూర్వార్థంలో 20 మాటలు మాత్రమే ఇంగ్లీషులోకి ప్రవేశించగలిగితే అదే శతాబ్దం ఉత్తరార్థభాగంలో 140 దాకా ప్రవేశార్హత సంపాదించగలిగాయి.

# ఆంగ్లభాషలో భారతీయ పదజాలం

1750 ప్రాంతాలవరకూ కూడా ఆంగ్లేయులు మన వర్తకంమీదనే బాగా దృష్టి వుంచారు యుద్ధాల జోలికి బాగా పోలేదు. అందుచేత వ్యాపారానికి కావలసిన మాటలను ఇదివరకే తీసుకుని వుంచడంచేత వారికి క్రొత్త మాటలు తెచ్చుకోవలసిన అవసరం లేకపోయింది ఏవో కొద్ది మాటలు "జూట్, బంగళాలు, కాశ్మీర్, దస్తూర్" లాంటివి మాత్రమే తీసుకోబడ్డాయి.

అయితే తీసుకోబడ్డ మాటలు విశేషార్థాలతోనూ చేర్పులూ కూర్పులతోనూ, కొన్ని కొన్ని సమాసాల మిశ్రమాలలోనూ విశేషంగా వినియోగింపబడ్డాయి ఉదా "బెంగాల్ సిల్క్, మ్యాంగోబర్, పాగోడ్ గాడ్, ఇండియా పెప్పర్, నవాబ్ మేకర్, మహారాటాడిచ్, సిపాయ్, ఛీఫ్, ఇండిగోబ్లైస్, నవాబిజమ్, నవాబ్ షిప్"

కానీ, వ్యాపార పదాలు ఈ శతాబ్దంలో ఎంత తక్కువగా వున్నాయో, రాజకీయ సైనిక పదాలు అంత ఎక్కువయ్యాయి. "సిపాయ్, సిబ్బంది, టెలింగా, రిసాలాహ్, లూటీవాలా, దివానీ" వంటివి ఈ రకానికి చెందినవి ఈ విధంగా సైనిక పదాలు వృద్ధి కావటం, ఆంగ్లేయులు భారతీయుల మధ్యగల సంబంధాలు ఏ స్థితికి వస్తున్నాయో విశదీకరిస్తుంది. మొదట్లో ఆంగ్లేయులకు ఆంగ్ల సిపాయీలే ఎక్కువగా వుండేవారు కానీ చివరకు ఈ ఆంగ్ల సిపాయీలే చిన్నరకంగా జమీందారుల్లాగా సంచరించడంతో మునేదార్లతో, హవల్దార్లతో, జమేదార్లతో, జాయింట్లతో భారతీయ దళాలు ఏర్పడ్డాయి ఈ శతాబ్దంలోనే విచిత్రమైన క్రొత్త పదాలు రెండు జనిస్తించాయి. 1 బ్లాక్ హోల్, 2 వాచ్ బ్లాక్ హోల్ ఆఫ్ కలకటా అనువాదమైనా ఆ పదం ఎంత సందేహాన్ని, దుమారాన్ని కల్గించినదో అంతటిని కల్గించింది. జనానాలో ఘోషాస్త్రీల ఆనందం నిమిత్తమై "వాచ్" ప్రవేశపెట్టబడింది ఇటువంటి జాతికి చెందిన పదాలే "చిలుం, ముక్కా, ఖేదా"లు.

## 1800 నుండి 1900 వరకు

ఈ శతాబ్దంలో పదాల ఎగుమతి దిగుమతుల వ్యాపారం బాగా ఎక్కువైంది క్రిందటి శతాబ్దంకన్నా, కొమర తంపరగా మాటలకు మాటలు పుట్టకుండా పరాపరి సంస్కృతంనుంచే అవి వృద్ధి అయినాయి. ఈ శతాబ్దంలోనే మొట్టమొదటిసారిగా "ఇండో-యూరోపియన్" అన్న శబ్దం వినబడింది ఈ శతాబ్దంలో మరొక్క విశేషం ఏమిటంటే, గతంలోలాగా కాకుండా, పరాపరి సంస్కృతంనుంచే అనేకపదాలు గ్రహించబడాయి. "ఉదా సంధి, గుణ, స్వరభక్తి దేవనాగరి" ఇత్యాది ఇంతవరకూ భాషా విజ్ఞానానికి చెందిన పదజాలమే విశేషంగా ఆంగ్లంలోకి తీసుకోబడింది కాని ఈ శతాబ్దంలో భారతీయ వేదాంతశాస్త్రం నుంచి ప్రాముఖ్యాన్ని సంపాయించుకొంది భారతీయసంస్కృతి, వాఙ్మయం, హిందూమతం తదితర పదజాలాన్ని ఆంగ్లానికి దత్తత చేసినవి "బ్రాహ్మణ" అన్న శబ్దానికి ఉచేల సంతతి కలిగింది "ఉదా: బ్రాహ్మనికల్ ఫిలాసఫీ, బ్రాహ్మనికల్, బ్రాహ్మణి-షిగ్-ప్ర

18వ శతాబ్దం చివరి భాగంలో "వేద, రిగ్వేద, అవతార్, సుర, తంత్ర," లాంటి పదాలు, 19వ శతాబ్దంలో "యోగ, అమృత, భక్తి స్తూప, బుద్ధిజం, శర్మ, దేవ, మహాత్మ, మేళా, పూజా, సంహిత, సంస్కార, ఉపనిషద్, విమాన" లాంటి పదాలు ఆంగ్లానికి బలాన్ని చేకూర్చాయి. ఇట్లా చేరి, తమ భావకు పుష్టి కలిందడాన్ని ఓవన్ బారిఫీల్డ్ మున్నగు వారెందరో సమర్థించారు అయితే "నర్మ, కర్మ, మాయ" ఇత్యాదికి ఆంగ్లంలో సరియైన అర్థాన్నిచ్చే మరో పదాలేవీ వారు సమర్థించవ మొక్క విలుకాడు

ఇంక సిపాయీలయుద్ధం, ఆఫ్ఘన్‌యుద్ధం సిపాయి తిరుగుబాట్లు మరికొన్ని పదాలను చేర్చినవి ఇంగ్లీషులోకి ఉదా: "పుక్కి, జైజైల్, పాంసి, చుపట్, లోటా, ఫంపీగార్" వంటివి ఆదిగాక సైనికులకి చెందని పదాలు—బంగీ, పచిసి, తమాషా, బంగారుహ్ హూలూక్, తూన్—అనేకం.

## ఇరవయ్యో శతాబ్దం

ఈ శతాబ్దంలో, ముఖ్యంగా భారతస్వాతంత్ర్య సమరం, ఇంగ్లీషులో మన పదాలు చేరడానికి చాలావరకు దోహదం చేసింది. ప్రథమ ద్వితీయ ప్రపంచ సంగ్రామాలు "అర్మీస్లాంగ్" ఏర్పడడానికి కారణమయ్యాయి "హాకాటీ, చర్, చెలో, అచ్ఛుంగ్,

"డికో, గన్‌వాలా" కొత్తగా పుట్టిన పదాలలో కొన్ని మాత్రమే. ఇక మహాత్ముని ఉద్యమం "అహింస"కు ప్రచారమిచ్చింది.

ఆ తర్వాత హిందూ మహమ్మదీయమత కలహాలు, పాకిస్తాన్ అవతరణం "పాకిస్తాన్ పాకిస్తానైజేషన్, గూండా, గూండాయిజమ్" మొదలయిన మాటలను అందరికీ తెలియజెపుతాయి.

ఏమైనా భారతదేశం రిపబ్లిక్ గా అవతరించడంతో, ఎటువంటి మార్పులు భారతాంగ్ల భాషల మధ్య కలుగుతాయో చెప్పడం కష్టం. కాని ఇప్పుడు ఈ రెండు దేశాలమధ్య వున్నటువంటి సుహృద్భావమే గనక కలకాలం నిలిచివున్నట్లయితే, భారతీయ భాషలు ఆంగ్ల భాషా సంపర్కంతో అభివృద్ధి పొందగలవనీ, భారత భాషల సంపర్కంతో ఆంగ్లభాష కూడా మూడు పూవులూ ఆరు కాయలూ కాయగలదనీ మాత్రం మనం నిస్సంశయంగా అనుకొనవచ్చు

## 4

ఇంతవరకూ ఆంధ్ర, తమిళ, మలయాళీ, గుజరాతీ, నేపాలీ, హిందుస్తానీ పదాలు ఏ కారణాల చేత, ఎన్నిగకాలంగా ఆంగ్లంలోకి తీసుకోబడ్డాయో అన్న విషయాన్ని గూర్చి తెలుసుకున్నాం. ఈ వ్యాసభాగంలో తీసుకోబడిన పదాలు ఎట్టిమార్పులకు గురి అయిందీ, ఈ మార్పులు చేయడంలో ఏదైనా పద్ధతి అవలంబింపబడిందా, లేదా అన్నవిషయాలను గురించి తెలుసుకుందాం.

నిదర్శనం హాకిన్స Pattans Psthans Ras. bootes Rajputs అనీ, సర్ థామస్ రో Cytore Chittore Umbras Omrahs అనీ, జాన్ ఫ్రయర్ Medapollon Madhavapalem. Shawjhan Shahjehan అనీ ఈవిధంగా విదేశీయులు వ్రాసిన పదాలలో 'స్పెల్లింగులో' భేదముండడానికి కారణం వారికి భారతీయభాషలనుగురించి సమగ్రమైన జ్ఞానం లేకపోవడమే. అయినా విదేశీయులు భారతదేశాన్ని గూర్చి పరాయివారల ముఖతః వినడమే కాని, ప్రత్యక్షంగా ఈ దేశాన్ని చూచి, ఇక్కడి పరిస్థితులను గమనించినవారు కారు. అయితే పర్షియన్, హిందూస్తాన్ భాషలను క్షుణ్ణంగా నేర్చుకున్న థామస్ కోర్యాట్, జాన్ మిల్డెన్ హాల్ వంటివారు లేకపోలేదు. కాని వారు చాలా తక్కువ.

కాని 19వ శతాబ్దంవచ్చేసరికి పరిస్థితులు కొంచెం మారుపడ్డాయి. భారతదేశం ఇంగ్లండు ఆధిపత్యం క్రిందకు రావడంతో బహుళ సంఖ్యలో ఆంగ్లేయులీ దేశానికి రావడమూ, ఇక్కడ భారతప్రజలనూ, వారిభాషలనుగూర్చి సమగ్రపరిశీలన చేయడమూ జరిగింది. ఇంతవరకు ఉచ్చారణ (Pronounciation) కే ప్రాముఖ్యం యిచ్చినవారల్లా ఇప్పుడు 'స్పెలింగు'కు కూడా ప్రాముఖ్యం యివ్వడం ప్రారంభించారు. సర్ విలియం జోన్సు వంటి పెద్దలు ఈ మార్పుకోసం బాగా కృషి చేశారు. అయితే అక్కడక్కడా కొందరు తెలివి తక్కువవారు లేకపోలేదు "బుద్ధ అనేవారు బుద్ధ అనడానికి; బాబర్ అనడానికి భాబర్ "

అయితే ఇరవయ్యో శతాబ్దం వచ్చేసరికి The Society for pure English వారు, దిగుమతి చేసుకున్న మాటలకు సరియైన ప్రతిపత్తి నిచ్చి, రూపకల్పన చేయడంలో మంచి కృషి చేశారు. పైగా భారతీయపదాలు కూడా పెద్ద మార్పేమీ లేకుండానే, ఆంగ్ల వ్యాకరణ చట్టంలోకి ఇమిడిపోయాయి. కాని ఆ రూపదాలకు "భలానా నామవాచకం, భలానిది క్రియ" అని చెప్పడంలోనే కొంచెం కష్టమైంది.

సాధారణంగా ఏ భాషలోనైనా నామవాచకాలే ఎక్కువగా వుంటాయి. ముఖ్యంగా, హిందీ, ఉర్దూవంటి భాషల్లో నామవాచకాలు పుంలింగాలుగానో, స్త్రీలింగాలుగానో వుంటాయి. ఉదాహరణకు "రోటీ" స్త్రీలింగమయితే, "దాల్" పుంలింగం— "తమాషా" పుంలింగమయితే "చిట్టీ" స్త్రీలింగం. కాని ఆంగ్లంలో, పదాలకు వాటివాటి అర్థాన్నిబట్టి మాత్రమే, లింగనిర్ణయం చేస్తారు.

ఆంగ్లంలోకి విశేషణాలు కూడా బాగానే తీసుకోబడ్డాయి. ఉదా: బెంగాలీ మాటలు, కచ్చా, పక్కా

కాని క్రియాపదాలను గ్రహించడం మాత్రం అంత సులభంగా జరిగింది కాదు. కొన్ని కొన్ని నామవాచకాలకు "—Age; - dom; - ism" చివర చేర్చారు. ఉదా: డకాయిటేజ్; బాబూడమ్; బ్రాహ్మణిజమ్; ఇత్యాది.

# ఆంగ్లభాషలో భారతీయ పదజాలం

క్రియాపదాలకు చివరన ing చేర్చారు ఉదా: బాటింగ్, షలామింగ్.

కొన్నిచోట్ల క్రియలనే నామవాచకాలుగా ఉపయోగించారు. ఉదా: షాంపూ, చెలో. మరి కొన్నిచోట్ల నామవాచకాలనే క్రియలుగా ఉపయోగించారు ఉదా: నాచ్, పంకా, టామ్ టామ్

మరికొన్ని, విస్తృతమైన అర్థాంతరాన్ని పొందగలిగినాయి ఉదాహరణకు 'అనకొండ' అన్న పదాన్నే తీసుకోవచ్చు మొదట్లో సింహళంలో ఒక కొక పామును "అనకొండ" అనేవారు కానీ దాను దాను ఏపామైనా సరే, తన కందిన ఆహారాన్ని వదిలి పెట్టకుండా దూర్దం దూర్దం తెసుకొనేది వున్నట్లయితే, దాన్ని 'అనకొండ' అని పిలవడం ప్రారంభించారు ఇలాగే విస్తృతపర్చబడిన అర్థాలతో "బందీకూట్ (తెలుగు పందికొక్కు), బంగాళా, ఫకీర్, కోహినూర్, ఖర్మన్" మొదలైన పదాలు వాడబడుతున్నాయి

మరికొన్నిచోట్ల, పదాలయొక్క అర్థం సంకుచితం చేయబడింది "నవాబ్, బాబూ, క్యాలికో" మొదలైన పదాల అర్థం ఇలా సంకుచితం కావడానికి లోనయింది.

మరికొన్ని సందర్భాల్లో కొన్ని కొన్ని పదాలు తమ పూర్వపు అర్థాన్ని కోల్పోవలసి వచ్చింది "ఉదా: బీటల్ నట్, కూలీ, గాడీ, జంగిల్, లూట్, మ్యాంగ్" మొదలయినవి

ఏమైనా ఇటువంటి పరిణామాలన్ని కూడా సజీవమైన భాషలో జరుగుతూనే వుంటాయి ఇంగ్లీషు నుంచి తెలుగులోకి దిగుమతి చేసుకోబడిన పదాలకు కూడా ఇదే గతి సంభవించింది అది సహజంకూడా!

## 5

ఈ వ్యాసం మొదట్లో మనవిచేసినట్లుగా, కొన్ని క్రొత్త పదాలు ఒక భాషలో చేరినప్పుడు, ఆ పదాలు బాగా వ్యాప్తిలోకి రావాలి అంటే, ఏతద్భాషలోని రచయితలే ప్రముఖపాత్ర వహించాలి. ఆ పదాలకు బాగా ఆదరణా వ్యాప్తి కలిగాలే, క్రమేణా నీటిశేవ చెట్లలాగా అవి కించిపోతాయి

అయితే ఆంగ్లరచయితలమాత్రం స్వపరభేదాన్ని పెట్టుకోకుండా, అవసరమైనప్పుడెల్లా విదేశీపదాలు వాడేవారు వాడుతున్నారు ప్రతిపదానికీ ఒక క్రొత్త చైతన్యాన్ని ఒక క్రొత్తదృష్టిని ఇచ్చారు ఆంగ్లవాఙ్మయంలో దిగ్గంతులైనవారిచేత ఈపదాలు వాడబడడంచేత, అది ఆ కవిపుంగవుల పరిపోషణలతోపాటు వివిధ రాయే తమతమ గ్రంథాల్లో ఈ పదాలను ఉపయోగించడంచేత, ఆంగ్లభాషాప్రవంతిలోకి ప్రవహించిన భారతీయ పదజాలం చెక్కు చెదరక విరివిచూపింపగలదని మనం ధైర్యంగా చెప్పవచ్చు

ఈస్టిండియా కంపెనీ భారతదేశానికి రాక పూర్వమే, భారతీయపదాలు కొన్ని, ఆంగ్లేయులచేత స్వీకరింపబడాయి ఉదా —అల్లం, బెరిల్, జింజర్, రస్, సుగర్, పాంథర్ — ఈ మాటలన్నీ కూడా గ్రీకు ల్యాటిన్ ఫ్రెంచిభాషలద్వారా ఆంగ్లంలోకి ప్రవేశించాయి ఆంగ్లకవుల రచనలనుంచి ఒకట్రెండు ఉదాహరణలిస్తాను

ఛాసర్ The Hous of Fame 1 1288 'Walles of berile'
వాల్లో 'సుగర్' అన్న పదాన్ని ఉపయోగించాడు డిటో, II 1 600 'రస్' అన్న పదాన్ని కూడా ఇతనే మొటగా ఉపయోగించాడు rice porridge, The Jew of Malta III IV. 1368
షేక్స్పియర్ 'పెప్పర్' అన్న మాట నుపయోగించాడు 'pepper-ginger bread' Henry IV III 1 260, 'pepper Corn Henry IV III III 9 [1] క్రియగా కూడా అతనీమాట నుపయోగించాడు

ఇన్నిపదాలను గురించి మనం మాట్లాడుకుంటున్నాంగాని, హిందూదేశానికి 'ఇండియా' అన్న పేరెలావచ్చిందో మనం చెప్పిందలేదు పాకిస్తాన్ లాగా, హిందూస్తాన్ అని మనం ఇప్పటికీ పిలుచుకుంటున్నా పాశ్చాత్యులందరూ కూడా 'ఇండియా' అనే భారతదేశాన్ని పిలుస్తున్నారు ఇండియా అన్నపదం సంస్కృతి 'సింధు' పదంగా వచ్చింది సంస్కృతం నుండి పర్షియాకు, అటుపై గ్రీక్, అక్కడినుండి ల్యాటిన్, అక్కడినుండి ఆంగ్లంలోకి ప్రవేశించింది ఓల్డ్ ఇంగ్లీషులో "ఇండియా, ఇండియాస్, ఇండిస్క" అన్నమాటలు కన్పిస్తున్నాయి కానీ 1200 1600 కాలంలో ఇండియా అన్నమాటపోయి "ఎంటే, ఇండే, ఇండ్" అన్నమాటలు వ్యాప్తిపొందాయి. ఛాసర్ 'ఇండే' అన్న పదాన్ని ఉపయోగించాడు స్పెన్సరు కూడా అదన్నే స్వీకరించాడు[2] అయితే ఒక్కసారి మాత్రం "ఇండియా" అన్నమాటమిల్టన్ ఉపయోగించడం జరిగింది అతనుంచి తూర్పు పశ్చిమఇండియా దీవు మూలంగా ఈమాట మరింత వ్యాప్తిలోకివచ్చింది. మిల్టన్ మహాకవి కోటన్ స్వర్గ సందర్భంలో మొగల్ ప్రస్తావన తీసుకవచ్చాడు[3]

---

1 "I am pepper'd, I warrant for this world" Romeo & Juliet III 1 104
2 The Faerie Queene II 72,5
3. Paaradise Lost. II 1 4

"బెంగాలా, పక్కాన్, మలబార్, ఆగ్రా, లాహోర్, గంజెస్, ఇండస్, హైడాస్పస్ (జీలం నది)"[2] మొదలైన పేర్లు ఉపయోగించాడు.

ఇంక 'ఇండియన్' అన్న పదాన్ని మొట్టమొదట సరిగా ఉపయోగించే గౌరవం డ్రైడెన్‌కు దక్కింది 1 అగిగాక అతను ఔరంగజేబుతో వ్రాసిన నాటక మొకటి వుండనే వుంది

18 వ శతాబ్దంలో, తిరువాన్కూర్‌లో పుట్టి, తన యౌవన ప్రథమార్థంలో ఇక్కడ ఉద్యోగం చేసిన రాబర్ట్ ఆర్మ్, ఎడ్మండ్ బర్క్ లిద్దరూ ఎంతగానో భారతీయ పదజాలా న్నాదరించారు ఒకరు ఈ దేశ వాసులతో కలిసి మెలిసి ఇక్కడి భాషా సౌంభాగ్యాన్ని గ్రహిస్తే, మరొకరు అటువంటి అవకాశము లేకుండానే, విదేశంలో వుండికూడా చక్కటి విమర్శనా జ్ఞానంతో, తప్పటడుగు వేయకుండా భారతీయ పదాలమీద స్వారిచేశాడు

డేనియల్ డీఫో ఫాక్స్, వాల్పోల్, స్మాలెట్ మొదలయిన వారంతా ఎక్కడో అక్కడ ఏదో వొక సందర్భంలో భారతీయ పదాన్ని వాడేవున్నారు

పందొమ్మిదవ శతాబ్దం చివరి భాగానికల్లా మహాపండితులైన "సర్ ఛార్లెస్ విల్కిన్స్, నథానియల్ హాల్ హెడ్, అలెగ్జాండర్ డౌ, సర్ విలియం జోన్స్, అలెగ్జాండర్ హామిల్టన్" ప్రభృతులంతా ఇండియన్ వ్యవహారాలమీద మక్కువ జూపి, భారతీయ భాషల నాదరించి, అందలి పదాలతో తమ సాహిత్యాన్ని కలింపుకొన్నారు ఏ తప్పూ లేకుండా వాడారు

ఇక పందొమ్మిదవ శతాబ్దంలో నవలా రచయితలూ, విమర్శకులూ, కవులూ, చరిత్రకారులూ, యావన్మందీ భారతీయ భాషల సౌష్ఠవాన్ని గుర్తించి, ఆయా పదాలను వాడుకొన్నారు

స్కాట్, సథే, బైరన్, మెకాలే, థాకరే, కిప్లింగ్, సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్, సర్ జి ఓ. ట్రెవెల్యన్, జేన్ ఆస్టిన్, టి యస్ ఇలియట్ ఇలా ఎంతమందినైనా చెప్పవచ్చు వారు వాడిన పదాల జాబితాలో నుండి "పరియాన్ జే, అమృత, బిగా, హిందూస్తానీ, థగ్, పతీల్, పండిట్, ఫకీర్"లాంటి వాటి కొన్నైనా చూపించవచ్చు

2సర్ వాల్టర్ స్కాట్ భారతదేశాన్ని గూర్చిన మొట్టమొదటి నవల వ్రాశాడు సథే హిందూ స్వర్గాలనూ, దేవతలనూ తన పద్యాల్లో చిత్రించాడు 3

కాని కిప్లింగ్ లాంటివారు హిందూదేశంమీది అభిమానంతో తమ తమ గ్రంథాల్లో వాడిన మాటలన్నీ కూడా సర్వజనులకూ ఆమోదయోగ్యం కాలేదు. చాలా మాటలు "గొలఖా, ఖైది, షాహిబా, జల్దీ, జాదూ" వంటివి చచ్చిపోయాయి

అయితే ఇరవయ్యో శతాబ్దంలో ఒక విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది. ఆంగ్లేయులు మనదేశాన్ని గూర్చి, మన జీవనాన్ని గూర్చి కథావస్తువులు తీసుకుని ఆంగ్లంలో రచనలు చేయడానికి బదులు, భారతీయులే రవీంద్రుడు చూపిన బాటలో, భారతీయ చైతన్యాన్ని యథాతథంగా చిత్రిస్తూ రచనలు సాగిస్తున్నారు

ప్రముఖ నవలారచయితలైన శ్రీ కె ఏ అబ్బాస్, డా ముల్క్ రాజ్ ఆనంద్, శ్రీ ఆర్ కె నారాయణ్ లాంటివారు చేస్తున్న కృషివలన ఆంగ్లానికి ఒక క్రొత్త జీవం వస్తున్నది అంతేగాక ఈ పత్రికల యుగంలో పత్రికా రచయితలు వహిస్తున్న పాత్ర మరీ ముఖ్యమైంది కావటంతో, ప్రముఖ పత్రికా రచయితలయిన శ్రీ కుందూరి ఈశ్వరదత్తు మొదలయినవారి ఉద్యమాలతో భారతదేశం ఆంగ్లభాష అనే అద్దంలో తనను తాను సగర్వంగా చూచుకొంటున్నది

ఇదే పదికాలాలపాటు వర్ధిల్లాలి రాజకీయంగా జాతిపరిస్థితి ఎట్లున్నా భాషల సంపర్కంలోనే, ఒక క్రొత్త చైతన్యం పొందగలుగుతుంది అప్పుడే అటు ఆంగ్లమూ, ఇటు భారతదేశ భాషలూ వర్ధిల్లేది! తథాస్తు *

---

1 Marriage ala Mode IV 304

2 The Surgeon's Daughter

3 The Curse of Kehama

* ఈ నా వ్యాసరచనలో శ్రీ జి. సుబ్బారావుగారి Indian Word in English అన్న గ్రంథము చాలావరకు తోడ్పడింది. ఇందుకు వారికి నా కృతజ్ఞతలు ఇంకా తోడ్పడిన గ్రంథాలు ఇవి

1 A Dictionary of American English on Historical principles

2 Daniel Jones' An English pronouncing Dictionary

3 H H Wilson A glossary of judicial and revenue terms and of useful words occurring in official documents relating to the administration of the Govt of British India.

# పిట్టపోరు

ఏసు: (వచ్చి) మీకు నీళ్లుతోడాను బాబుగారూ!

శాంతా: లేరావా స్నానం చెయ్యి ప్రొద్దెక్కింది.
(నారాయణయ్య లోనికెళుతూంటాడు. శాంతా రమ్మని అతనివంక చూచి చూచి త్రిప్పుతుంది)

శాంతా: (మెల్లిగా) ఒరేయ్ ఏసుకొండలూ.

ఏసు: అమ్మా!

శాంతా: నేను అన్నయ్యతో పెళ్ళివిషయం మాట్లాడ దానికొచ్చినట్లు ఈయనకు తెలియనివ్వకు

ఏసు: అందుకేనేం టమ్మగోరూ మీరొచ్చింది?

శాంతా: ఊఁ! నిమ్మళంగా మాట్లాడు వింటాడు. అందుకేరా!

ఏసు: సరేలెండమ్మా.

శాంతా: అతడు తంపులమారి మనిషి! మా అన్నయ్య మనసువిరిచేస్తాడనుమా!

ఏసు: సిత్తెం

శాంతా: ఎలాగయినా తనకూతుర్ని మా సత్తిగాడి మెడకు తగిలించాలని చూస్తున్నాడు.

ఏసు: అవునండీ! వచ్చిరాంగానే అయ్యగారితో ఆ రాసకార్లే మాటాడ్డారు.

శాంతా: (ఆదుర్దాగా) మాట్లాడాడూ? అన్నయ్యే మన్నాడు?

ఏసు: నాను సరిగా ఇనలేదుగానండి, మొత్తానికయ్య గారు సరిగా సమాధానం సెప్పినట్టులేరండి.

శాంతా: హమ్మయ్య! ఒరేయ్ ఏసుకొండలూ!

ఏసు: అమ్మా!

శాంతా: ఎవరెంత తన్నుకుచస్తేమాత్రం, నా అన్న నన్ను కాదంటాడ్రా?

ఏసు: ఎట్టాగంటారండి!

శాంతా: అయినా ఎంత బావమరిదయితే మాత్రం. అయినా ఇంకేం బావమరిదితే! మా వదినతో పోయింది వాళ్ళకూ మాకూ చుట్టరికం! ఏమం టావు?

ఏసు: (అయిష్టంగా) సిత్తెం.

శాంతా: సరేగాని, బయటసంబంధాలేమయినా వస్తున్నాయా?

ఏసు: అయ్యో! రాకపోటం ఏంటండీ! కట్టారొండా! వొండలు! వొచ్చేపొయ్యేవోళ్ళకి తెంపులేదంటే నమ్మండి!

శాంతా: మరి మా అన్నయ్యేమంటున్నాడు?

ఏసు: ఉలుక్కుండా పలుక్కుండా అట్టానే వుండారు.

శాంతా: చూడు ఏసుకొండలూ! ఉద్యోగస్తుడంటే ఎవరికయినా ఆశ కలగొచ్చు. అందుకనే, ఏ నిముషాన ఎలావుంటుందో, ఆ కాస్తమాట అని పించుకొనే పనదామని వచ్చాను. ఏమంటావ్?

ఏసు: సిత్తెం. మా పెద్ద మంచాలోచనండీ

శాంతా: మనమ్మాయిని చూశావుగా నువ్వు? ఎలా వుంటుందంటావు

ఏసు: బుల్లెమ్మగోరి కేంవండి? చినిమాటాకులాగుం టారు!

శాంతా: మా సత్తిగాడికి తగిందేనంటావా?

ఏసు: ఎంతమాట! మూడుముద్దలెయ్యారండీ జంట!

శాంతా: ఒరేయ్ ఏసుకొండలూ! నువ్వుకూడా మా అన్నయ్యకు నచ్చజెప్పాలిసుమా!

ఏసు: అంతకంటేనా అప్పమ్మగోరూ!

శాంతా: మా చెట్టుకొచ్చిన జాంపళ్లు తెచ్చాను. నాలు క్కాయలిస్తాగాని తీసుకెళ్ళి పిల్లలకు పెట్టుకో

ఏసు: సిత్తెం.

శాంతా: సరే, లోపలకెళదాం పదవ్. నారాయణయ్యకు నైవేద్యం పెట్టాలిగా మరి!

ఏసు: సిత్తెం తప్పేదేంవుంగుండీ
(ఇద్దరూ లోనికెళుతూంటారు. రామానుజయ్య హడావుడిగా బయటనుండి వస్తాడు)

రామా: (బిగ్గరగా) ఒరేయ్ ఏసుకొండలూ!

ఏసు: నే నిక్కడే వుండాను బాబూ!

రామా: బండొచ్చేటయమయ్యింది. వాళ్ళొస్తార్రా!

ఏసు: ఓరు బాబూ?

రామా: రెడ్డొచ్చి మొదలాడినట్టుంది! ప్రొద్దు ట్నుండీ చెప్పిందిమ్రా?

ఏసు: గురితిలేదు బాబూ!

రామా: ఎందుకుంటుంది; నీక్లు క్రొవ్వెక్కేసరి! మాధ వయ్యగారొస్తారని చెప్పలేదట్రా?

# పిట్టపోరు

శాంతా : ఇద్దరూ మన మిద్దరం ఒక్క మాట మీద నిలబడి, అతన్ని మానవయ్యగారితో అన్నయ్య వివాహం కుదరకుండా చూడాలి.

శారా : ఓ! తప్పకుండా. గట్టిగా నిలబడి ఆడుకుందాం. అడుగడుగా కేమిటి, పోట్లాడుదాం

శాంతా : అలా చేస్తే తర్వాత మన విషయం..

శారా : అం, దానికి మొన్నేం! నీ పిల్లయితే కాటి నా పిల్లయితే కాటేనా శాంతారమ్మొదినా?

శాంతా : నీ కడుపు చల్లగా మాటన్న (బతుకు నారాయణమ్మ బావా!

శారా : సరేగాని, శాంతారమ్మొదినా! నా కడుపులో, దేముడు గోలపెడుతున్నాడు అన్నగత్రపానివి మరి!

శాంతా : అయ్యో! నా మతిమండిపోను. పెరటి పోడిలోపడి ఆ మాటే మరిచిపోయాను పదపద (ఇద్దరూ లోనికి నడవబోగా కొందరూగి బయట నుండి రామానుజయ్య, ఆయన వెనక నే పేరయ్య వస్తారు. పేరయ్య చేతుం చెప్పులు, చంకలో చింకి గొడుగు, చేతిలో సంచీ, చింకి కోటు, కొద్దిగా మాసినగడ్డం )

రాము : రాండి రండి. ఇలా కూర్చోండి.

పేర (కుర్చీ మీద కూర్చుంటాడు ఏసు కొంచెం లోపలనుండి వస్తాడు )

రాము : (బిగ్గరగా) ఒరేయ్ ఏసుకొండెలూ!

ఏసు : ఇక్కడే వుండానుబాబూ!

రాము ఆ సంచీ అదీ లోపల పెట్టు

ఏసు : చిత్తం. (పేరయ్యవంక చూచి) దండాలు మానవయ్యగారూ!

పేర : (చిలిపిగా నవ్వుతూ) నేను మానవయ్యగారికి వ్యయాన బావమరిదిని. నా పేరు పేరయ్యంటారు

ఏసు అట్లాగా! దమించండి బాబూ! మా అయ్యగోరు మానవయ్యగా రొత్తారంటేను .

పేర : అవును. వారు రాత్రిబండిలో తప్పక రాగలరు

ఏసు : చిత్తం

రాము మువ్వొళ్ళు పేరయ్యగారికి చేసినీళ్ళు తోడవా ఏసుకొండెలూ! (లోనికి నడుస్తాడు)

ఏసు : చిత్తం (వెళ్ళిపోతుంటాడు)

పేర : ఇదుగో కొండెలూ! (మెల్లగా పిలుస్తాడు.)

ఏసు : నాపేరు ఏసుకొండెలండీ!

పేర : అం అదే అదే నాకు సరిగా జ్ఞాపకముంటేగా, ఏమీ అనుకోకు.

ఏసు పరవాలేదు లెండి.

పేర : ఇదుగో అబ్బాయ్! మాట (ఒళ్ళు గోక్కుంటూ ఉంటాడు)

ఏసు : అయ్యా.

పేర ఇలా దగ్గరగా రా

ఏసు : (దగ్గరగా వస్తాడు)

పేర నీళ్ళు కొంచెం వేడి జాస్తిగా వుండాలి సుమా! (మెల్లగా చెబుతాడు)

ఏసు హీ హీ తానదగా నుండేంటి పేరయ్యగోరూ!

పేర హుంష్! బిగ్గరగా అనకోయ్ బాబూ! నువ్వేదో కుంటివాడివని చెప్పుకొంటే

ఏసు. పరవాలేదు లెండి. (సంచీ తీసుకొని వెళ్తాడు )

రాము (లోపలనుండి చాగాకుతో వస్తాడు.) చుట్ట కాలుస్తారా?

పేర : నశ్యం కోర్నాళ్ళలో వాడికేతండి (జేబులోనుండి పొడుం డబ్బి తీసి) ప్రస్తుతం ఈ సంఘంలో సభ్యుడివయ్యాను (పట్టు పీలుస్తాడు)

రాము మానవయ్య బావగారుకూడా ఈ బండిలోనే వస్తారనుకొన్నాను (చుట్ట ముట్టిస్తాడు)

పేర : తప్పక వచ్చివుండే వారేనండి. అనుకోకుండా రాష్ట్ర మంత్రిగారు దయచేశారు ఎలక్షన్ పీరియడ్ గదండీ! వారిని సాగనంపే వరకూ వుండాలిగా మరి!

రాము అయ్యో కాదు మరి! పెద్దవారితో పనయ్యే రాత్రికయినా తప్పక వస్తారంటారా?

పేర : మా మానవయ్య బావ మాట తప్పటం, అటు సూర్యుడిటు పొడిస్తే!

రాము చిత్తం చూడండి పేరయ్యగారూ!

పేర అయ్యా!

రామా: మా అమ్మాయినిగురించి నేచెప్పబోవటం అంతగా బాగుండదనుకోండి—

పేర: పర్వాలేదు; సెలవివ్వండి.

రామా: నిజంగా మావాడు బుద్ధికి బృహస్పతి అంటే నమ్మండి.

పేర: చిత్తం ఊరు గొప్ప గొడవే చెబుతాయిగదండి!

రామా: ఇక అందం విషయంలో ఆ విషయం నేను చెప్పనలవలేదు రండి కావాలంటే అమ్మాయిఫోటో ఇక్కడేవుంది.

పేర: అక్కర్లేదు కూడా. మిమ్మల్ని చూస్తే అమ్మాయి రూపం కళ్ళల్లో మెదులుతోంది సుమండి! ఆ బంగారు ఛాయ, ఆ విశాలమయిన నుదురు, చెంపకు చారెడేసి కళ్ళు ఆ ఒడ్డు పొడుగూ ఒహో!

రామా: (పొంగిపోయి) చూచినట్లుగానే వర్ణించారు.

పేర: మరేమి టనుకొన్నారు మన బుర్రంటే! కర్మ గాలి ఈరోజు ఈ స్థితి కొచ్చానుగాని. చిన్నప్పుడు మా తాతగారంటుండే వారు— "ఒరే పేరిసీదూ! నీ తెలివి తేటలముందు రాజాలే కూడా పనికిరాదురా! నీరాతబాగుంటే, స్వతంత్ర మొచ్చిన తర్వాత నువ్వు తప్పక మంత్రి వయితీరతావురా" అని

రామా: అవును. అంతటి అర్హతలు గాకపోతేదు.

పేర: అదృష్టరేఖ మనచేతిలోనుండి తొలగిపోయి యిలా ఏడుస్తున్నాను.

రామా: ఇప్పుడు మాత్రం తను కొచ్చిన లోటేమిటి లెండి.

పేర: సరే, అవన్నీ తరువాత ముచ్చటించుకొందాం (పొడుం పట్టుపీల్చి) ఇక అసలు విషయానికి వద్దాం. రామానుజయ్యగారూ! మన స్థిర చరాస్తుల ఛోగట్టా కొంచెం యిస్తారా!

రామా: తప్పకుండా నవరత్నఖచితమయిన సుక్షేత్రం పకవలకైా ఎకరా ఉందండి.

పేర: అయ్యా!

రామా: పోతే రెండెకరాలమామిడితోట, ఈ ఇల్లు..

పేర: ఊఁ సెలవివ్వండి (బుర్రాడిస్తాడు.)

రామా: ఏదో తను దయవల్ల కొద్దో గొప్పో నిలవ లోనే వున్నామనుకోండి.

పేర: సంతోషం.

రామా: క్రిందటి సంవత్సరం సరిగ్గా ఈరోజుల్లోనే మా ఇంటావిడ దేహం చాలించింది.

పేర: విచార కరమయిన విషయం

రామా: అందుచేత వాడికో ఇంటివాడిని చేస్తే భారం తీరిపోతుంది. ఆ తర్వాత రామాకృష్ణ అనుకొంటూ పోయిగా ...

పేర: కాదుమరి!

రామా: చూడండి పేరయ్యగారూ!

పేర: చిన్నవాణ్ణి. తమ్ముడూ అని పిలిచినా యిబ్బంది లేదు.

రామా: ఏదో లోకాచారా న్ననుసరించే గాని, కట్నాలు కానుకలు విషయంలో నా కంతగా పట్టింపులేదు సుమండీ.

పేర: చిత్తం.

రామా: డబ్బు శాశ్వతమా చెప్పండి? గుణగణాలు, సాంప్రదాయాలు ముఖ్యం గాని.

పేర: ఎలాగయినా తెలిసినవారు.

రామా: ఈమధ్య మరీ పచ్చపాయ్యే సంబంధాలకు తెంపులేకుండా వుంది సుమండీ! నలకై వేలిస్తా మని, యాభై వేలిస్తామనీ డప్పేస్తోంది గదా అని అడ్డమయినవాళ్ళతో చేయి కలుపు తామా!

పేర: భాధా! అందులోనూ తమరా?

రామా: మాధవయ్యగారి మంచి చెడ్డలు విన్న తర్వాత వారు, అసలు వేరే సంబంధం తెచ్చుకు మనసు పోవటంలేదు.

పేర: చిత్తం.

రామా: చూడండి తమ్ముడుగారూ! మనలోమాట ..

పేర: నిరభ్యంతరంగా సెలవివ్వండి.

రామా: ఇలా అడుగుతున్నందుకు మరోవిధంగా అను కోకు—

పేర: వ్యవహారం నిర్మొహమాటంగా వుండాలనే వాళ్ళ జాబితాలో నేను ప్రథముణ్ణి.

ఇప్పుడు మా రాధ డబ్బుకోసం గడ్డితిని, మీ మీ సంబంధాలు చూస్తున్నాడు దీనికి పిల్లవాడి అభిప్రాయమ్ముద ఏమాత్రం లేదు వాడెప్పటికీ నా అల్లుడే! కాని నరోత్తమా, మీరు వచ్చిన దారినే దయచెయ్యండని చెబుతున్నాను.

పేర మరి (ఏదో చెప్పబోతాడు)

నారా : (సీరియస్ గా) మరీ లేదు గిరీ లేదు వచ్చినందుకు ఖుషీగా భోంచేసి బండెక్కండి లేదా.. (పళ్లు బిగించి పిడికిలి చూపుతాడు.)

పేర (వణుకుతూ) అలాగేనండి

నారా లోపలికి రెండడుగులు వేసి, వెనక్కు తిరిగి) పేరయ్యగారూ!

పేర అయ్యా!

నారా మీరు భోంచేసేవరకు జట్కా వచ్చి వాకిట్లో వుంటుంది మీరు మా రాధతో ఈ గొడవేమీ చెప్పకుండా ఏం తెలిసిందా? (గద్దిస్తాడు)

పేర : చిత్తం. విపులంగానే చెబుతున్నానుగా! తప్పకుండా ఎక్కుతాను.

నారా : (దగ్గరగా వచ్చి) మా రాధతో ఈ విషయం చెప్పారో మీరు మరి తెనాలి చేరే ఆశ వుంచకు

పేర (భయపడుతూ) చి. చిత్తం అంతవరకూ అక్కర్లేదండి (లోపలనుండి కాంచారమ్మ కంఠం వినిపిస్తుంది)

కాంచా అదీ చూస్తా నా కంఠంలో ఊపిరుండగా ఆ ఇచ్చేవాడెలా యిస్తాడో, చేసుకొనేవాడెలా చేసుకొంటాడో

రామూ (లోపలనుండి) ఇదుగో కాంచారమ్మత్తల్లీ! నీకు పుణ్యముంటుంది గాని, పరాయి పెద్దమనిషి ముందు నా పరువు తీయబోకు

కాంచా (బిగ్గరగా) ఎవరుంటే నాకేం భయమా? ఆ పెద్దమనిషినే అడుగుతాను, ఇది న్యాయమేనా?

పేర (నారాయణయ్య వంక చూచి, ఆ గొడవేమిటన్నట్లు సైగచేస్తాడు)

నార : పిల్లదాని మేనత్త. ముందు నిన్ను సాగనంపితే తర్వాత ఆ విషయం చూసుకొంటాను. మీరు మాత్రం ప్రయాణసన్నాహంలో వుండండి. (బయటకు వెళ్ళిపోతాడు)

పేర కామ్మయ్య! (కుర్చీలో చతికిలబడతాడు)

కాంచా : (మొగ్గలావచ్చి) ఇదుగో ఏమయ్యా పెద్దమనిషీ! న్యాయం ఆపిల్లల్ని కనుక్కోవాలా? నీ పిల్లలాంటిదిగాదూ నా పిల్లమాత్రం? నీకేమయినా జ్ఞానముంటే, మేనరికముండగా పిల్లనిస్తావని వస్తావా?

పేర (ఇంతసేపూ నీళ్ళు నమిలిపోతుంటాడు కొంచెం తేరుకొని) ఇదుగో తల్లీ! భవానీదేవి!

కాంచా : నా పేరు కాంచారమ్మ.

పేర ఏ అకాచారమ్మయితేనేం గాని, మీ గొడవలేమీ నాకు తెలియవు నా బుద్ధి గడ్డితిని ఇక్కడకు వచ్చాను. వచ్చినందుకు బాగా శాస్తి జరిగింది. దయచేసి ఏమీ అనకండి తల్లీ! నేనిప్పుడే వెళ్ళిపోతున్నాను.

కాంచా : వుంటావంటే మాత్రం వుండనిచ్చేదెవర్లే! (లోపలకు చూస్తూ) ఒరేయ్ ఏసుకొండయ్యా!

ఏసు (లోపల్నుండి) ఓయ్ వస్తున్నా. (వచ్చి) ఏంటమ్మగారూ?

కాంచా లోపల పేరయ్యగారి సంచీ వుందిగావాలు తెచ్చి వారికివ్వు

ఏసు వీరేదో మాట్లాడుకుంటారా బాబూ?

కాంచా ఏదో ఏడుస్తారులే, నీకెందుకు? తెచ్చివ్వు

ఏసు (పేరయ్యతో) ముందు తావం పెయ్యండి

పేర (ఏదో చెప్పబోతాడు కాని, కాంచారమ్మ వంక చూచి ఆగిపోతాడు)

కాంచా తెచ్చివ్వరా అంటుంటే (గదమాయిస్తుంది)

ఏసు చిత్తం (అమాంతంగా లోనికెళతాడు.)

పేర : (గొంతు సవరించుకొని) ఇదుగో కనకదుర్గమ్మగారూ!

కాంచా : నా పేరు కాంచారమ్మగారూ బాబూ!

పేర : ఏదయితేనేంలెండి కాని ఒక్కమాట.

కాంచా : ఏమిటది?

పేర : నేను వెళ్ళిపోటం ఎలాగూ ఖాయం గనుకొండి కాని.

కాంచా : కాని?

పేర : పన్నెండు దాటుతోంది-ఇది మా కే పల్లెటూరు భోజన హోటళ్ళేవీ యిక్కడ వున్నట్టు లేదు-అందుచేత

శాంతా (తీవ్రంగా) అందుచేత?

పేర : అబ్బే ఏం లేదు

శాంతా : ఇదుగో పేరయ్యగారూ! ఈ తంటాలన్నీ నాకు తెలియవు గాని, ఇలా దారిన పోయ్యే దానయ్య లందర్నీ పిలిచే రేపు నా కూతురు బొచ్చె పట్టుకు తిరగాల్సిందే! ఇప్పట్లేం ఉన్న కళ్ళుగాని దయచెయ్యండి

పేర చిత్తం భోజనానికి పిల్చిందని

శాంతా మరేం ఫర్వాలేదు ఒక్క పూటకేం పుట్టి మునగదు లే (ఏసుకొండలు పంచితో వస్తాడు)

శాంతా (పేరయ్యతో) తీసుకోండి

పేర : (తీసుకొని లోనికి చూస్తుంటాడు)

శాంతా ఇంకేం టయమవుతోంటే, ఇంకా అటు చూస్తా రేమయ్యా?

ఏసు ఏంటి పేరయ్యగారూ ఎల్లిపోతారా?

శాంతా నువ్వు నోరు మూసుకొని లోపలికెళ్ళరా ఏసుకొండలూ.

ఏసు : చిత్తం (లోనికెళతాడు)

శాంతా : ఇక కదలవయ్య దేముడా

పేర : అహా, ఏం లేదు నాయుడుగారితో చెప్పి పోదామని

శాంతా : ఏమక్కర్లా. నే చెబుతాన్లే వెళ్ళు అయ్య జపంమీదున్నాడు

పేర అలాగే (మెల్లిగా నడుస్తుంటాడు) (లోపలనుండి రామానుజయ్యగారు అదుర్దాగా వస్తారు ఆయన వెనకే ఏసుకొండలు వస్తాడు)

రామూ అఁ అఁ! అదేమిటండీ పేరయ్యగారూ! ఎక్కడికి?

పేర : (ఆగి) ఎక్కడికో వెళ్ళ (గ్రహచారం కాకేం బట్టింది? నా ఇంటికి వెడుతున్నాను (వెళ్ళ బోతాడు.)

రామూ (దగ్గరగా వెళ్ళి (బతిమాలుతూ) నా అపరాధ మేదయినా వుంటే మన్నించండి.

పేర : మీ తప్పేముంది బాబూ! ఈ ఇంటికి రావటం నాదే తప్పు సెలవు (వెళ్ళబోతుంటాడు)

రామూ : (చెయ్యి పట్టుకొని) ఆగ్రహించకండి. విషయమేమిటో చెప్పండి. (శాంతారమ్మతో) ఏమిటమ్మాయ్ ఇదంతా? నువ్వేమైనా అన్నావా?

శాంతా ఏమన్నా అనటమేం! వెళ్ళిపొమ్మన్నాను

రామూ అఁ!

శాంతా : ఏం ఎందుకనను? నా కూతురి సుఖం చెడగొట్టటానికి తయారైనాడలా ఈ పెద్దమనిషి?

రామూ : (పట్టలేని కోపంతో) ఛా! పోగాలయే నా ఇంటికొచ్చిన పెద్దమనిషి నవమానిస్తావా? (పేరయ్యతో) పేరయ్యగారూ! మీకు కావలసింది చేసు. వ్యవహారమంతా నాది. ఎవరేమంటే మీ కెందుకు? మీరు వెళ్ళకండి

పేర ఇంత అవమానం జరిగిం తర్వాత

రామూ అందుకు నన్ను క్షమించండి (చేతులు పట్టుకొని) ఇవి చేతులు గావు

పేర అఁ అఁ! అంత మాటనకండి పెద్దలు! అయినా కుర్రవాడికి మేనరికముండగా

రామూ అవన్నీ మీ కెందుకు? నా ఇష్టమయి నేను పిలిచానుగా!

పేర : చిత్తం

శాంతా : అయితే నువ్వు వత్తిగాడికి నా పిల్లను చేసుకోవ్వటా అన్నయ్యా? నన్నింత మోసం చేస్తావా? (ఏడుస్తుంది)

రామూ : ఏమిటి మోసం? నీ పిల్లని చేసుకొంటానని ఎప్పుడయినా హామీ యిచ్చానా? పేరయ్య గారూ! మీరు లోనికెళ్ళి స్నానం చెయ్యండి. తీసుకెళ్ళరా ఏసుకొండలూ!

ఏసు రాండిబాబూ! (పేరయ్య, ఏసుకొండలూ లోనికెడతారు.)

శాంతా అయితే నువ్వు వత్తిగాడికి నాపిల్లని చేసుకోనిచ్చే గదురా అన్నయ్యా?

రామూ : నీ కేలాతోస్తే అలా గనుకో.

శాంతా : (దుఃఖస్వరంతో) అయితే ఈ నిముషాన, నీ వాకిట్లో నే, ఈ కాస్త ప్రాణం తీసేసు కొంటా ఇంకా బతుకెందుకు?

ఏడు : అయ్యో!

రామా : నువ్వు కోపమానుకో కాస్సేపు.

ఏడు : నిత్తెం.

పేర : కాని చూశారా అన్నయ్యగారూ!

రామా : ఏమిటది?

పేర : తొందరపడి అయిన వాళ్ళను

రామా : మీకు తెలియదూయకోండి పేరయ్యగారూ!

పేర : చిత్తం.

(కాంచారమ్మ ట్రంకుతో తిరిగి వస్తుంది)

కాంచా : పద నారాయణయ్య బావా తోడబుట్టిన దాన్ని ఉపవాసముంచి ఏం బావుకుంటాడో చూస్తాను.

ఏడు : భోజనం సెయ్యండి అప్పమ్మగారూ!

కాంచా : ఇంకా ఈ కొంపలో గంగ ముడతానట్రా!

రామా : మంచిది (నారాయణయ్య, కాంచారమ్మ వెళ్ళబోతుంటారు. బయటనుంచి పోస్టుమేన్ కేక వినిపిస్తుంది) నారాయణయ్య, కాంచారమ్మను ఆగమని సైగ చేస్తాడు.

రామా : ఉత్తరమేదో వచ్చింది లాగుంది చూడరా

ఏడు : (బయటకెళ్ళి కవరుతో తిరిగొస్తాడు) ఇదుగోండి.

రామా : (అందుకొని, పరిశీలించి) అబ్బాయే రాశాడు!

ఏడు : ఏం రాశాడు బాబూ?

రామా : ఉండరా చదవండే!

(చింపి చూస్తాడు ఒక ఉత్తరం, ఫోటో వుంటాయి. ఆదుర్దాగా ఉత్తరం చదివి) కొంప మునిగిందిరా ఏడు కొండలూ!

(దిగ్గరగా అరచి కూలబడతాడు)

ఏడు : ఏంది బాబూ!

కాంచా : ఏమిట్రా అన్నయ్యా?

నారా : ఏం జరిగింది బావా?

పేర : ఏమిటంతటి విశేషం? (అంతా ఆదుర్దాగా దగ్గర కొస్తారు)

రామా : ఏం చెప్పను నారాయణయ్యా! నీ అల్లుడు నా కొంప నిలువునా ముంచాడు.

నారా : ఏం జరిగింది బావా?

రామా : ఏం జరగకూడదో, అదే జరిగింది. యిటు చూడు. (లెటరందిస్తాడు.)

నారా : (అందుకొని లోలోపలే గబగబా చదివి) ఆరి పిడుగా! ఎంతపని చేశావురా!

కాంచా : ఏమిటి నారాయణయ్య బావా?

ఏడు : పైకి చదవండి బాబూ

నారా : ఇంకా చదివే దేముందిరా ఏడుకొండలూ! మా సత్యంబాబు ఒక కాలేజీ పిల్లని ప్రేమించి పెళ్ళి చేసుకొన్నాడట! ముందుగా చెబితే వాళ్ళ నాన్న ఒప్పుకోడని పెళ్ళయింతర్వాత ఉత్తరం రాశాడు

ఏడు : ఆఁ!

కాంచా : నిజంగానా నారాయణయ్య బావా?

నారా : నీమీద ఒట్టు. కాంచారమ్మొదినా ఇదుగో ఫోటో కూడా పంపాడు

కాంచా : కొంప ముంచావు కదరా సత్తిగా! (భోరు మంటుంది)

పేర : కాలమే మారిందిలెండి, ఈ కాలంలో ఇలాంటివి సహజంగా జరిగిపోతూ వున్నాయి

ఏడు : మొత్తానికి పిట్టపోరూ పిట్టపోరూ పిల్లి తీర్చిందిలెండి బాబూ! [తెర]

# ఉపగూహనము

శ్రీ శివశంకరశాస్త్రి

## పూర్వార్థము

౧

ఎవరో యొక చోటుకాడు
ఇటీవలను జెప్పినట్టి
గాథ ననుసరించి యల్లు
కథన కావ్య మీ రచనము.

సత్యమైన, కాకున్నను
సంఘటనలు విన్నవారి
పెదవులపై దరహాసం
బుదయించుటయే తథ్యము.

సంఘటనం బాదియందు
సరసముగా సాగె, కాని
మధ్యమార్గమందు మిగుల
మందముగా నడచుచుండె.

వివిధగతుల రాగగాథ
విచిత్రముగ నొక్కనాడు
పరిణయోత్సవమ్ములోన
పరిసమాప్తి నొందెనంట!

౨

మంథనాగ్రహారమందు
మహీసురుల వంశమందు
పుట్టినాడు యోగ్యుడైన
పురుషోత్తమశర్మాఖ్యుడు

ఆంగ్లవిద్యతో పాటుగ
అధ్యయనము చేసినాడు
తండ్రికడన కొంత కొంత
తైత్తిరీయసంహితలో.

వేదములో వర్ణితమౌ
వివిధదేవతాకృతులను
చిన్ననాటనుండి యతడు
చేయుచుండు భక్తితోడ.

పాఠశాలలోని విద్య
పరిసమాప్తి నొందినంత
అవల నేమి చేయవలయు
నన్న చర్చ సాగబొచ్చె.

అంతలోన తండ్రి పోయె
అమ్మ చిన్ననాడె చనియె.
మిగిలె బంధువర్గమందు
మేనమామ యొక డతనికి.

మంథనలో పెంకుటిల్లు
మంచి పంటభూమియు గల
వతనికి, లేదేమాత్ర
మార్థికమ్ముగా లోపము

అగ్రహారమందు కలరు
అయిదుమూర్ల పట్టభద్రు
లందుచేత మేనమామ
ఆ చదువే చదువు మనియె.

అతడు పట్టభద్రుడైన
ఆత్మజాత నిచ్చి పెండ్లి
వైభవమ్ముతోడ జేయ
వచ్చు ననుచు మామ కోర్కె.

3

మేనమామ కూతురైన
మీనాక్షీదేవి కూడ

## ఉ ప గూ హ న ము

శర్మ శిశదలోన చెప్ప
శక్యముకానట్టి ప్రీతి.

అనుదినమ్ము వీక్షించెడి
యభ్యాసమువలన ప్రీతి
కలిసిపోయె మానసములు
క్రమముగా నుభయులకును.

చనవువలన నడుమనడుమ
చమత్కారవాక్కు లాడి
గూఢముగా ముద్దులాడు
కుమారి చెక్కిళ్ళ సతము.

ఎదురుగా నరుగుదెంచు
నేని మేనమామకూతు
రుల్లాసముతో నలతిగ
నుపగూహన మాచరించు.

పిన్నవారి రాగసరణి
పెద్దల కభిమతమె కాన
పరిణయమ్ము నిశ్చయ మని
భావించిరి బంధుజనులు.

ఆమె జనని వాంఛితంబు
ఆయేడే పెండ్లి చేయ
మేనల్లుని చదువు ముగియ
మీద చేయ తండ్రి తలపు

౪

పంపినాడు మేనమామ
భాగ్యనగర కలాశాల
లోన జేరి చదువు మనుచు
మేనల్లుని మంచినాడు.

అచటి కలాశాలలందు
అలభ్యమైపోయె తావు
చిత్రకళాశాలలోన
చేరినాడు తుదకు శర్మ

శక్తికొంత, ప్రీతికొంత
స్వతస్సిద్ధముగని యుండు
కారణమున శిల్పకళను
కడువడిగా నేర్చు కలిగ.

అచటి యొజ్జలెల్ల సిద్ధ
హస్తులైనవార లగుట జేసి
సహోధ్యాయులైనవారు
శ్రద్ధధాను లగుటవలన—

చిత్రకళాశాలలోని
జీవిత మాతనికి మిగుల
ఉద్బోధక ముత్తేజక
ముల్లాస ప్రదము నయ్యె

చలికాలపు సెలవులలో
స్వగ్రామము చేరువరకు
ఈ విద్యాభ్యాసచరిత
మెవ్వరికిని తెలుప డతడు

నిజము తెలిసి మేనమామ
నివ్వెరపా టొంది యపుడు
కొంతవడికి తెప్పరిల్లి
కోపముతో ననియె నిట్లు

"కులీనోర్వీ సురుడ వీవు
కులాలుండ వయినావా!
భావికాలమందు రాతి
పనివాడవు కానుంటివ!

ఉన్నయెడల నీ తండ్రియె
ఒప్పునొకొ దీనికి? నీ
విద్యావిషయములో నిక
విడిచినాను నా బాధ్యత!"

విరసవాక్యములకు శర్మ
విమనస్కుం డగుచు పోయి

గోదావరితీరంబున
కొంతతడవు విశ్రమించె—

కాంచి శిథిల విగ్రహములు
గౌతమేశ్వరాలయమున
స్వామి దర్శనమ్ము చేసి
సదనమునకు జేరినాడు.

"ఇంత ప్రొద్దుపోవు వరకు
ఎచట తిరిగినావు బావ?
అటులున్నా వెందుల?" కని
ఆదరముగ నడిగె కన్న.

"మీ నాయన యే మనెనో
మీనా, విన్నావు కదా
చెప్పుము నీవైన నిజము,
శిల్పవిద్య దూష్యంబా?"—

ఆ మాటల కర్థోక్తిన
అనునయసుస్వరముతోడ
"తనకు నచ్చు కార్యము నే
తత్పరతం జేయదగును.

"నన్నమాట కేమి కాని
నా ప్రతిమను చేయుదువా?
మిగుల ప్రీతి శిల్ప" మనుచు
మీనాక్షీదేవి పలికె.

బాలపలుకు నమాయికపు
భాషణముల తెప్పరిల్లి
చిరునగవున శర్మ యామె
చెక్కిళులను ముద్దాడెను.

౫

మేనమామ, మేనత్తయు
మీనాక్షీదేవి కూడ
వారించుచు నున్న వినక
వ్యగ్రామము విడిచె నతడు.

నిజకళ పురుషోత్తముండు
నిష్ఠతోడ నభ్యాసము
చేయుచు సక్రమముగాని
సిద్ధహస్తు డగుచుండెను.

భారతీయ శిల్ప చరిత
పౌరాణికగాథావళి
పాశ్చాత్యకలాచరిత్ర
పఠియించుచునుండె నతడు.

చేతినిండ ధన ముండుట
చేత ప్రసిద్ధాలయములు
కళాక్షేత్ర దర్శనమ్ము
కావించును సెలవులలో

చిత్రలోకవిహారణంబు
చేయు నతని కప్పుడపుడు
మీనాక్షీదేవి రూపు
మెలగుచుండు స్మృతిపథమున.

౬

అచట మంథెనాగ్రహార
మందు తల్లి తమ తనూజ
పరిణయోత్సవమ్ముగూర్చి
భర్తను త్వరపెట్టుచుండె.

"అన్వేషణ చేయుచున్న
ననుగుబిడ్డ పెండ్లికొరకు
యోగ్యుడైన వరుం డిచట
ఒకడు కూడ కానరాడు."

"మేనల్లుడు చెంతనుండ
మీనాక్షికి వేరే వరు
డెందులకో? మీ వాక్కులు
ఎప్పుడు చిత్రముగ నుండు!"

అనెడి భార్యభాషణముల
కడ్డు వచ్చి భర్త యనియె :

"బొమ్మలు చేసెడివానికి
పుత్రిక నెట్లీయగలను!"

"ఇదియా మీ సందేహం,
బింకేమీ యనుకొంటిని.
పురుషోత్తమశర్మ కేమి
భూలోపము, ధనలోపము?

చేయవచ్చు సంపాదన
శిల్పకళామార్గాలమ్మున
మంచిపేరు వచ్చు ననుచు
మన మీనాక్షమ్మ మతము."

ఇట్లు భార్య ప్రతివచనం
బిమ్మచ్చినంత, యజమానుడు
ఏమి యనక శిరసు మాత్ర
మిట్టటు కదలించినాడు.

౮

పెట్టెలతో బుట్టలతో
పెద్దపెద్ద యట్టలతో
స్వగ్రామమునందు దిగుచు
స్వగృహమ్ము చేరె శర్మ.

పరిసమాప్తి చేసి విద్య
భాగ్యనగర కళాశాల
విడిచి వచ్చి మంథెనలో
విశ్రమింప దలచినాడు.

ఎనిమిదేండ్ల నారాయణ
ఎగురుచు నుల్లాసమునను
అమ్మ, బావ వచ్చినాడె
అనుచు తల్లితోడ జెప్పె.

"నాకు చేయితీరలేదు—
నారాయణ, మీనాక్షీ,
బావను పిలుచుకు రండని
పంపె జనని ప్రీతితోడ.

తెచ్చుకొన్న వస్తుచయము
తీర్చిదిద్ది, వారి వెంట
ప్రక్క వీథిలోని మామ
భవంతికిం జేరె శర్మ.

మేనత్తకు పట్టుచీర
మీనాక్షికి నారాయణ
కెన్నెన్నో వస్తువులను
ఏర్పరించి యిచ్చినాడు.

కుశలాదిక మడుగు వెనుక,
గోదావరి కేగి వత్తు
అట్టె ప్రొద్దుపోవకుండ
నని పురుషోత్తము డరిగెను.

భోజనార్థ మతని బిలువ
బోయినపుడు రాత్రి కన్య,
"ఉండుండుము మీనాక్షీ,
ఒక్కదాని మరిచినాను"—

అని యతండు పేటి తెరచి
అందలి ముత్తెముల దండ
దీసి యామె కంఠంబున
వేసి యప్రయత్నముగా—

వెనుకకు రెండడుగు లేసి
వీక్షించుచు నామె మోము
చిరునగవున ముందు కరిగి
చెక్కిలి ముద్దాడినాడు.

"పెద్దదాన నయినా" నని
పిల్ల పలుక లజ్జతోడ,
ఉల్లాసముతో నతండు
ఉపగూహన మొనరించెను.

౯

అత్త భాగ్యనగరవార్త
లడిగి, పెరుగు వేయువేళ

# కారల్‌మార్క్సు ఆర్థిక సిద్ధాంతాలు

ఇక మార్క్సు వేతన సిద్ధాంతం (Theory of wages) కూడా సాంప్రదాయిక పంథాలోనే సాగి పోయింది. కార్మికుడు సరిగ్గా బ్రతకడానికి అంటే చనిపోకుండా ఉండేందుకు తగు మాత్రం వేతనాన్ని పెట్టుబడిదారునివలన పొందుతాడు. అంతే కాని తాను ఉత్పత్తి చేసిన దానికి పూర్తి విలువను పొందజాలడు. అతని శ్రమవలన వచ్చిన లాభభాగము పెట్టుబడిదారుడు తీసుకుపోతాడు. ఈ విధంగా శ్రామికుని అన్యాయం చేసి అతనికి చెందవలసిన మిగులు తానే తీసుకుంటాడు పెట్టుబడిదారుడు. మార్క్సు దృష్టిలో ఇది ఒక విచిత్రమైన సాంఘిక దౌర్జన్యము. క్రింది ఉదాహరణము మార్క్సు భావాన్ని వెల్లడిస్తుంది. కార్మికుని కొన్ని కనీసపు వేతనము విలువ శ్రమదృష్ట్యా చూస్తే ఒక అర్థరోజు శ్రమ పరిమాణానికి సమానమనుకుందాం. అంటే పెట్టుబడిదారుడు ఒక అర్ధదినపు పరిమాణముగల శ్రమ కనీసపు వేతనరూపంలో శ్రామికునికిస్తూ ప్రతిఫలంగా ఒక పూర్తి రోజు శ్రమ ఫలితమైన వస్తువు పొందుతాడు. శ్రామికుని ప్రయాసతో ముందున్న గంటల ఉత్పత్తి పరిశీలనంగా మారిన యాంత్రిక సాధనలను పెట్టుబడిదారుడు ప్రవేశపెట్టినప్పుడు గణనీయంగా ఉత్పత్తి రెట్టింపైనా, అతను వేతనాలను మాత్రం ఏవిధంగానూ పెంచడు. లాభభాగాన్నంత తనకే అట్టిపెట్టుకొంటాడు. తిరిగి ఈ లాభమంతా ప్రోగుచేసినదాన్ని పెట్టుబడిగా తయారుచేసాడు. కార్మికులను పెద్దఎత్తుగా అన్యాయం చేసి లాభాలను అందరికి పోయినటికే పెట్టుబడి దాన్ని మార్క్సు ఈసడించాడు. నిలుపడదు. ఇలాగని మార్క్సు పెట్టుబడిని, యాంత్రిక పరిశ్రమను, శ్రామికులను నిరసిస్తున్నాడని తలచరాదు. కాని ఈ ఉత్పత్తి సాధనాలను పెట్టుబడిదారుని స్వంత ఆస్తిగా పరిగణింపరాదని ఆయన వాదం. ఈవిధంగా సాంప్రదాయిక మార్కెటు విలువల సిద్ధాంతాన్ని, వేతన సిద్ధాంతాన్ని తన భావాలతో సమన్వయించి పెట్టుబడిదారీ వ్యవస్థపై ఆయుధంగా ఉపయోగించాడు మార్క్సు.

ఇటువంటి ప్రయత్నాన్ని మార్క్సుకు ముందు చేసి కొంత విజయం సాధించినవాడు జోహాన్ కార్ల్ రాడ్ బెర్టస్ (1805-1875) అనే జర్మన్ అర్థశాస్త్రవేత్త. అయితే మార్క్సు అంత స్పష్టంగాను, విస్తృతంగాను, కార్యక్రమంగాను ఈయన సిద్ధాంతీకరించలేక పోయాడు.

చారిత్రక పరిణామాన్ని గురించి మార్క్సు వెలుబరించిన భావాలు అతను హెగెల్ తత్వప్రభావానికి ఎంతగా లోనయ్యాడో విదితం చేస్తాయి. హెగెల్ తత్వ ప్రకారం మానవసంఘ పరిణతి ద్వంద్వ విరుద్ధ పరస్పర సంఘట్టన పూర్వకమైనది. మూలంగా ఈ తత్వాన్నే తీసుకొని చారిత్రక పరిణామానికి ప్రయోగించాడు మార్క్సు. దీనికే ద్వంద్వ సంఘర్షణాత్మక భౌతిక వాదము (Dilectical materialism) అని పేరు. ప్రథమంగా ఒక సంఘము క్రింద ఏర్పడి మానవులు పరస్పర సహకారంతో మెలగేవారు. స్వేచ్ఛా సమానత్వాలు ఆ ఆదిమ సంఘంలో నెలకొని ఉండేవి. కాని కాలక్రమేణ ధనం, అధికారం హస్తగతం చేసుకునే ప్రయత్నంలో తగాదాలు, కొట్లాటలు, పరస్పర వైషమ్యాలు ఏర్పడినాయి. ఆ సంఘం అనేక తెగలుగా విడిపోయింది. ఈ తెగలు ఒకదానితో ఒకటి పోరాటం సలిపి కొల్లగొట్టేవి. శాంతి సమానత్వాలు నాశనమయ్యాయి. యుద్ధ పరికరాలు, యంత్రాలు కనుగొనబడ్డాయి. పూర్వపు శాంతి కోమలత, సర్వోద్ధరణ పరాయణత్వం అడుగంటాయి. తదనుగుణమైన సాంఘిక పరిస్థితులు దానితో ప్రబలము కాజొచ్చాయి.

ఈ విధమైన కల్లోలాన్ని, దౌర్జన్యాన్ని పోగొట్టడానికి మారిన సంఘ, మారిన భావాల అవసరం. దౌర్జన్యంవలన, కల్లోలంవలన లాభపడేవారు ఏ మార్పులను అంగీకరించక ప్రాత విధానాన్నే బలపరచారు. కాని వారి దౌర్జన్యాలకు, అన్యాయాలకు బాధపడే కార్మికులు ఎంతో కాలం సహనంగా ఉండలేరు. పరస్పర విరోధులయిన ఈ రెండు తెగలకు కలహం సంభవించింది. ఈ పరిస్థితి క్రమంగా తీవ్ర సంఘర్షణకు దారితీసి అంతంలో ఒక నూతన సాంఘిక వ్యవస్థను జనింపచేస్తుంది. తరతరాలుగా తమను పీల్చి పిప్పి చేస్తున్న పెట్టుబడిదారుల నిరంకుశత్వంనుండి విడివడి శ్రామికులు తమకు సౌఖ్యకరమైన నూతన రాజ్యాంగాన్ని, నూతన సాంఘిక నియమావళిని తయారు చేసుకుంటారు.

ఇదంతా చాల శాస్త్రీయమైన భావమని మార్క్సు విశ్వసించాడు. డార్విన్ పరిణామ సిద్ధాంతం వలెనే ఇది అతిశాస్త్రీకము, అతిసహజము అయిన సిద్ధాంతమని ఆయన అభిప్రాయం. సాంఘిక పరిణామము ఏదో ఒక్క నేలలో జరిగిపోయేది కాదని, అది చరిత్రగమనం వలన సిద్ధించేదని మార్క్సు విశ్వసించాడు. ఈవిధమైన శాస్త్రీయ తర్క ప్రధానమైన తన సామ్యవాద సిద్ధాంతానికి ఒక ప్రత్యేకత కలిగించి అంతకుముందున్న భావాలను మించినదని మార్క్సు పేర్కొన్నాడు.

ఈవిధమైన చారిత్రక పరిణామాన్ని విస్మరించి ఏదో ప్రత్యేకమైన విధానాన్ని గురించి కలలుకనే తత్వజ్ఞులను మార్క్సు తీవ్రంగా నిరసించాడు. చారిత్రకంగా పరిస్థితులు పరిపక్వస్థితిలోనికి రానిదే ఏదో విధానాన్ని లేవదీసే ప్రయత్నాన్ని కాల

ద్రోయమని మార్క్స్ తన జీవితంలో ఎన్నడూ ఉపదేశించలేదు. ఐతే ఆ పరిపక్వస్థితి వచ్చినతరువాత అహింసాయుతంగా పెట్టుబడిదారీ విధానాన్ని తొలగిద్దామంటే సాధ్యమయే విషయం కాదని ఆయన ఊహ. ఆ పరిస్థితులలో తరతరాలుగా దుర్దశలో ఉన్న కార్మిక వర్గమంతా తిరుగుబాటుచేసి విప్లవంలో విజయాన్ని సాధిస్తుంది. పెట్టుబడిదారీ విధానానికి ప్రారంభంలోనే పతనం ఎన్నటికీ సంభవించదు. దాని ఉచ్ఛస్థితి వచ్చిన తరువాత దానివలన అన్నీ కష్టనష్టాలే కాని ఏమీ ఉపకారం లేదని ప్రజలు తెలిసికొన్న తరువాతనే దానికి పతనం సంభవిస్తుంది. ఈవిధంగా పెట్టుబడిదారీ విధానపు పతనము, కార్మిక రాజ్యాంగవ్యవస్థ నిర్మాణము చాలసహజంగా, పరిణామక్రమంగా జరుగుతాయి.

ఈ పరిస్థితులలో సామ్యవాద నాయకుల కర్తవ్యం ఏమిటోకూడ మార్క్స్ ఉపదేశించాడు. కేవలం కార్మికవర్గానికి వారిబాధలకు హేతువేదో తెలిపి వారి తిరుగుబాటుకు సర్వవిధాల చేయూతనొసగి వారికి తగు సలహాలనివ్వడమే నాయకుల కర్తవ్యం.

తన సిద్ధాంతాల శాస్త్రీయతను నిరూపించుకొనడానికి అవి ఆచరింపబడితే ఏమిజరుగుతుందో ముందుగానే సూచించాడు కార్ల్‌మార్క్స్. కార్మికులసంఖ్య క్రమముగా పెరిగిపోవడం, పెట్టుబడిధనమంతా కొందరు వ్యక్తులహస్తాలలో కేంద్రీకృతం కావడం ప్రథమంగా జరుగుతుంది. కార్మిక వర్గానికీ ("Proletariat") పెట్టుబడిదారులకు నడుమ సంఘర్షణ వృద్ధి అవుతుంది. ఈ సంఘర్షణలో కార్మికవర్గం రెండువిధాలుగా విజయాన్ని సాధింపవచ్చును. ఒకటి ప్రజాస్వామ్య పద్ధతులద్వారా ఎన్నికలలో గెలిచి అధికారాన్ని హస్తగతం చేసికొనడం, రెండవది విప్లవాన్వితంగా పెట్టుబడిదారులను సంహరించడం. ప్రశాంత మార్గంద్వారా విజయం ప్రజాస్వామ్య దేశాలలో జరగడానికి కొద్దిగా అవకాశం ఉందని మార్క్స్ సూచించినప్పటికీ, ఆ విధానంపైన ఆయనకు నమ్మకం లేదు.

పెట్టుబడిదారీ వ్యవస్థ పరిపక్వమువందినకొలదీ కార్మికవర్గమునకు కష్టనష్టాలు ఎక్కువౌతాయని మార్క్స్ తెలియజేశాడు. క్రమంగా పెట్టుబడిదారులు అధికలాభాలనాశించి శ్రామికుల వేతనాలను తగ్గించి, వారుచేయవలసిన పనిని కష్టతరం చేస్తారు. రానురాను ఉత్పత్తి పెరిగిపోవడం, గిరాకీ తగ్గిపోవడం సంభవిస్తుంది. తమవద్ద పెరిగిపోతూన్న పెట్టుబడిధనంతో లాభాలకోసం తహతహలాడే ధనికులు ఏమిచేయాలో తోచక ఈ విధానాన్ని అన్నిరంగాలకు వ్యాపింపచేస్తారు. వ్యవసాయంలోకూడా ఈవిధానం ప్రబలమౌతుంది. భూములంతా కొంతమంది పెట్టుబడిదారుల వశమై రైతులంతా కేవలం కార్మికులౌతారు. ఈ రంగంలోకూడా పెట్టుబడి హెచ్చైన కొలదీ లాభాలు తగ్గిపోతాయి. ఈవిధంగా ఒకవంక నిర్విరామంగా ప్రోగుపడుతున్న పెట్టుబడి ధనం, తీవ్రంగా పడిపోతూన్న గిరాకీ —వీనికితోడుగా ఆర్థికరంగంలో తీవ్రసంచలనం కలిగించే పోటులోట్లు ఎక్కువై క్లిష్టపరిస్థితులకు దారితీస్తాయి. కార్మికవర్గం సహనం పూర్తిగా కోల్పోయి అఖండవిప్లవానికి ముందంజవేస్తుంది. ఆ మహావిప్లవ సంగ్రామరంగంలో పెట్టుబడిదారులు సంపూర్ణంగా నాశనం చేయబడతారు. అధికారం, ధనం, అన్నీ కార్మికుని వశమౌతాయి. ఈ విధంగా, తనలో అంతరంగికమైన తీవ్రమైన దోషాలమూలంగానే పెట్టుబడిదారీ వ్యవస్థ దారుణాంతం పొందుతుంది. అంతా సహజ చారిత్రక పరిణామం. దీనినెవరూ ఆపలేరు. ఇదే భవిష్యత్తునుగూర్చిన మార్క్స్ ఊహాచిత్రం.

పెట్టుబడిదారీ విధాన వినాశనం, కార్మికపక్ష విజయం సిద్ధింపబడినతరువాత విశ్వశాంతి, మహాసౌఖ్యం—ఇంకా ఏవేవో వాటంతటవే కలుగుతాయి అని అనడమే కాని తత్సాధనకు ఏ నిర్దిష్ట ప్రణాళికను మార్క్స్ సూచింపలేదు. ఆ స్థితిలో రాజ్యాంగాన్నిగూర్చి, ప్రభుత్వాన్నిగూర్చి, ఆయన కొంతవరకే పేర్కొన్నాడు. అప్పుడు కార్మికపక్ష కార్యనిర్వాహకవర్గమే ప్రభుత్వంగా వ్యవహరింపగలదట. విరోధిపక్షం సర్వనాశనమవడంవలన దీనికి సర్వనియంతృత్వాధికారాలు వస్తాయి. దీనినే మార్క్స్ కార్మికపక్ష నియంతృత్వము ("Dictatorship of the proletariat) అని వ్యవహరించాడు. కాని ఈ నియంతృత్వంకూడ అట్టేకాలం ఉండదు. సంపూర్ణమైన సామ్యవాద స్థితి రాగానే ఈ రాజ్యాంగమంతా దానంతటదే సహజంగా అదృశ్యమౌతుంది. తిరిగి ప్రజలలో స్వేచ్ఛా సమానత్వాలు, పరస్పర సహకారం తలెత్తుతాయి. వర్గవిభేదాలు, పరస్పర కలహాలు లేని ఆ కార్మిక మహావ్యవస్థలో మానవుడు సర్వసుఖాలననుభవిస్తాడు. ఈ విధమైన ఊహాచిత్రమే కాని ఒక విధమైన నిర్దిష్ట ప్రణాళికను మార్క్స్ సూచింపలేదు. సామ్యవాద వ్యవస్థలో ఫలవిన్యాసం ఏ విధంగా జరుగుతుంది? పెట్టుబడి ఏ రంగాలలో ఏ పద్ధతులలో ఉపయోగింపబడుతుంది? ద్రవ్యోల్బణాది దుష్ఫలితాలు ఏ విధంగా అదుపులో పెట్టబడతాయి? ద్రవ్యము, లాభములు ఏ పరిమాణాలలో పంపకం చేయబడతాయి? అనే ప్రశ్నలకు మార్క్స్ సమాధానం సూచింపనైనా లేదు. అయితే ఆయన సిద్ధాంతాలవలన కార్మిక పక్షానికి ఒక గొప్ప ఆధారం లభించింది. ఏ విధంగా వ్యవసాయ దారులకు ఫ్రెంచి ఫిజియోక్రాట్ ఆర్థిక విజ్ఞా

# కారల్ మార్క్స్ ఆర్థిక సిద్ధాంతాలు

ములక్ష్మి చేయూత కొనసాగిందో, ఏ విధంగా పెట్టుబడి దారులకు సాంప్రదాయక ఆర్థిక శాస్త్రజ్ఞుల సిద్ధాంతాలు ప్రోత్సాహాన్ని కలుగజేశాయో, అట్టి విధంగానే కార్మిక పక్షానికి మార్క్స్ రచనలు అధిక బలాన్ని చేకూర్చాయి.

ఈ విధంగా మార్క్స్ ఆర్థిక శాస్త్ర సిద్ధాంతాలను సింహావలోకనం చేసుకొన్న పిదప తత్ప్రయోగాని కత్వాన్ని పరిశీలిద్దాం

ఏ ఆర్థిక సిద్ధాంతాలను అంశగా చేసికొని మార్క్స్ శిష్యులు సామ్యవాద తత్త్వాన్ని విప్లవాత్మకంగా ప్రపంచ విస్తృతం చేయాలని నడుము కట్టుకున్నారో, ఆ తత్త్వంలోనే అతి ప్రాథమికమైన దోషం ఉండడం గమనార్హం.

మార్క్స్ సగర్వంగా నిర్ధారించి అతి శాస్త్రీయమని చాటిన చారిత్రక పరిణామ వాదము అసత్యమైంది. ఆయన ఊహించినట్లు, పెట్టుబడిదారీ విధానం ఎంతో పరిపక్వస్థితినందిన అమెరికా సంయుక్త రాష్ట్రములవంటి దేశాలలో సహితం వ్యవసాయం పారిశ్రామికం చేయబడి కొద్దిమంది పెట్టుబడి దారుల హస్తాలలో భూమంతా కేంద్రీకరింప బడ లేదు. పైగా, ఆయా దేశాలలో ప్రభుత్వాలు చేసిన భూసంస్కరణములవలన వ్యవసాయరంగంలో అనేక మార్పులు వచ్చాయి. భూమి కొలదిమంది పెట్టుబడి దారుల చేతులలో కేంద్రీకరింపబడటానికి మారుగా శాసనములవలన ఎంతగానో వికేంద్రీకరింపబడి చిన్న చిన్న రైతులను ఆర్థికపటుత్వం కలిగించింది. ఈ విధంగా జరగగలదని మార్క్స్ మేధాశక్తి ఊహాతీతమైంది.

పెట్టుబడిదారీ వ్యవస్థ పురోగమించినకొలదీ, కార్మికుల సంఖ్య అత్యంతాధికమై అన్ని వర్గాలను అధిగమిస్తుందని మార్క్స్ ఊహించాడు. కాని చరిత్ర గమనం దీనినికూడ అసత్యమని నిరూపించింది. కాల క్రమాన వృత్తి విద్యల మూలంగాను, చిన్న చిన్న వర్తకములమూలంగాను, ఇతరమైన ఉపాధులమూలంగాను జీవనాన్ని సాగించేవారి సంఖ్య పెరుగుతోందే కాని దేశమంతా కార్మికులలో నిండిపోవటం లేదు.

కార్ల్ మార్క్స్ ఊహాచిత్రణంలో అన్నిటికన్నా ముఖ్యమైన దోషము పెట్టుబడిదారీ వ్యవస్థ వృద్ధి చెందినకొద్దీ కార్మికుల కడగండ్లు అధికమౌతాయని మార్క్స్ చేసిన వర్ణనమంతా అతిశయోక్తి! అది కొన్ని ఆధునిక పెట్టుబడిదారీ దేశాలు నిరూపించాయి. బాగా వృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాల్లో మార్క్స్ చెప్పినట్లు వేతనాలు తగ్గిపోయి, కార్మికులంతా కడగండ్ల పాలు కాలేదు. వారి జీవనప్రమాణాలు రోజు రోజుకీ పెరుగుతున్నాయి అమెరికావంటి పరిపక్వ స్థితి నందిన పెట్టుబడిదారీ విధానము గల దేశాలలో స్వంతకార్లలో సుఖంగా తిరిగే కార్మికులను చూస్తే మార్క్స్ ఊహాచిత్రం ఎంత వాస్తవికతా రహితమైనదో తెలుస్తుంది.

ఇక మార్క్స్ పరిణామ సిద్ధాంతంలో మరొక ఘోరమైన అసత్యాంశం ఒకటి ఉన్నది—కార్మిక విప్లవం, బాగా పరిపక్వత నందిన పెట్టుబడిదారీ దేశము లందే సంభవిస్తుందని ఆయన ఊహ. ఇదికూడా సత్య దూరమని చరిత్ర నిరూపించింది. పందొమ్మిది వందల పదిహేడవ సంవత్సరం నాటికి రష్యాగణంలో పెట్టుబడిదారీ విధానం అసలు ప్రారంభదశలో నయినా ఉందా అన్న విషయం సందేహాస్పదం. అల్లాగే విప్లవం నాటికి చైనాలో పారిశ్రామికాభివృద్ధి ఏమాత్రం లేదు. ఈ దేశాలలో విప్లవాలను రాజకీయ విప్లవాలంటే కొంత సబబుగా ఉంటుంది! ఇంక అటు వంక బాగా పరిపక్వ స్థితిలోనికి వచ్చిన పెట్టుబడిదారీ వ్యవస్థలలో—ఉదాహరణకు అమెరికాలో అసలు సామ్యవాద మహావిప్లవ ప్రసక్తే లేదు!

ఈ దోషాల నటుంచి ఆర్థికశాస్త్ర విజ్ఞానిగా కారల్ మార్క్స్ స్థానం పరిశీలిద్దాం. కార్మికుల కష్టాలను చూచి అత్యాగ్రహంగా వ్రాసిన ఆయన విప్లవాత్మకమైన వ్యాసాలు, గ్రంథాలు, పటుతర రాజకీయ మహాప్రభంజనాలను సృష్టించాయి. ఆయన సిద్ధాంతాల ఆధారంగా చేసికొని అనేక నూతన రాజకీయ పక్షాలు వెలిసి చాలా అలజడి కలిగించాయి. అయితే ఈ విప్లవాలు ఆర్థికశాస్త్ర రంగంలో ఏమాత్రం నూతన వికాసాన్ని కలిగించలేకపోయాయని తెలుపవచ్చును. సాంఘిక పరిణామ విజ్ఞానానికి మార్క్స్ సిద్ధాంతం ఒక అమూల్యమైన చేర్పు. అయినప్పటికీ కేవలం ఆర్థికశాస్త్ర దృష్ట్యా దానికి అంత గొప్ప విలువ లేదు. మార్క్స్ ప్రతిపాదించిన మారకపు విలువల సిద్ధాంతం, వేతన సిద్ధాంతం—అన్నీ కూడా ప్రాచీన శాస్త్రజ్ఞులు చాలావరకు కూలంకషంగా చర్చించినవే కాని క్రొత్త వేమీ కావు.

ఈ విధంగా విమర్శిస్తే మయిన ఆర్థికశాస్త్ర దృష్టితో చూస్తే కార్ల్ మార్క్స్—స్మిత్, రికార్డో, మార్షల్ మొదలైన ఆర్థిక శాస్త్రవేత్తల తరహాకు చెందిన ఆర్థిక శాస్త్రవేత్త కాదని చెప్పవచ్చును.

లా జాతుగులను చేపట్టారు. ఆ దెబ్బతో నాయుడుగా రింట్లో సిరీ, సంపదకూడా ఖాళీ అయిపోయాయి. అయినా నాయుడుగారి ఆనందానికి కొరతలేదు తన ప్రపంచాన్ని సంగ్రహపరిచాడు ఇంట్లో దరిద్రదేవత కరువు నాట్యం చేస్తూ పెరుగుతోంది అయినా ఐశ్వర్యంలాగ, సంపదలు పదిరెట్లు అయ్యాయి కాని నాయుడు గారి జీవితం మాత్రం కష్టం మాత్రమే. ఆ అవి అనేక వాటికి విలేకరికి కాని తనకొచ్చేయుండు, ఉద్యోగంలో చేరినవాళ్ళు, తనకన్న పని చేస్తున్న వాళ్ళు పెద్ద పెద్ద ఉద్యోగస్థులయి పోతున్నారు వాళ్ళలో ఉన్న విశేషం, తనలో లేని శక్తి ఏమిటి చెప్పాలనుకున్నాడు నాయుడుగారు

ఈ విషయంగురించి పరిశోధనలు చేయటం మొదలుపెట్టారు దాని అంతూ కనిపెట్టారు అన్నిటికీ మూలం ఏమిటో గ్రహించాడు తన ఈ అభిరుచిలోనయినా బాలుడుగ ఉన్న సమయంలోనే పోతే తన పిల్లలగతి యేంకాను! తన వృద్ధాప్యంలో, యింటి గింజాకు చేలోకం, ఒక కానీ యిస్తుంగా తను చేసుకు పోడింగ దినంగా ప్రార్థిస్తాం జై? అయినా ప్రపంచానికి అనుకూలంగా తే నడుచుకోవాలి మరి ఈ చిన్నమయిన ఆలోచనలు ఆయన పెద్దరికలలో ప్రవేశించి వృద్ధిపొందిన కొద్దీ, ఇంట్లో అనేక ప్రశాంతములు నెలకొంటుంది జీవితం సుఖంగా, హాయిగా, హాగా లంచం ఎలాగో అలాగ డబ్బు గణించి తీరాలి అనే ఉద్దేశ్యంలోకి వచ్చారు నాయుడుగారు అది మనిషి ప్రవృత్తిలోని విగ్రహం ఒకసారి తిను కొని లచిన ప్రమాదం మనస్సులో ప్రవేశించగా, దాన్ని లాగో ఒకలాగ, హిమాలయ ప్రమాణమయిన అలంకారప్రచా సాధిస్తుంది ఆ కుసిగిమనః ప్రవృత్తే కావాలి! రావాలి! దాన్ని నాయుడుగారు సాధించగలారు. అలా కోరికే అనుకున్నంత మాత్రంలో చే అదిలత్యంగాదు చుట్టూ ఆవరించిన పరిస్థితులు కూడా సమకూరాలి

మగపిల్లల గదువు, యింట్లో తిండి, యింటద్దె, అందరికీ బట్టలు, మనస్సుకు వినోదం, ప్రశాంతి నాశనం అన్నిలోటే ఈ జీవితంలో! అన్నీ చిక్కులే!

నాయుడుగారి జీవితం యీ చిక్కులమయం అయింది ఆయన సంసారంలో ఉన్న వ్యక్తుల జీవితాలన్నీ కలిసిపోతున్నాయి, చిక్కుపడేవ దారపుంపిలా తయారయ్యాయి ఒక్క మనిషిలోయిమిడిపోయిందింకా అదే డబ్బు! అది సంపాదించి తీసుకొనకున్నాడు, తనలో తను ఇదితనలోనే యీ అభిప్రాయాన్ని తనకు కలగజేసేందుకు ఆ ధనవంతుడే బ్రాంతిగా చిగుళ్లు పెట్టాడు. ధనవంతుడికి కాలేని కలక పోయినా, తోంటు తనకు కలిగిందుకు, లోలోన తన్నుతను అభినందించుకొని, అప్పుడప్పుడు యెదురు తిరిగే తన లోలోపలి అంతరాత్మ గొంతులిసి చంపి వారేసాడు నాయుడుగారు!

డబ్బు రాబట్టటం ఆరంభించాడు డబ్బుగూడా అలాగే రావటం మొదలెట్టింది డబ్బు వచ్చినకొద్దీ నాయుడుగారికి ధనతృష్ణ అధికమయింది. ఏ పనయినా ప్రతిఫలం ముట్టకుండా ఎందుకు చెయ్యాలి అనే ఉద్దేశంలోకి వచ్చేశారు పెద్దయినా, చిన్నయినా, ఎక్కువయినా, ఏ పనయినా, తన విధియైనా, ఏ మయినా సరే, డబ్బు లేందే నాయుడు గారి వద్ద పనిజరగటం కల్ల అనే ఖ్యాతి గడించాడు ముందావాడు!

కష్టజీవులకిది కష్టంగా ఉన్నా, దొంగ వ్యాపారులు, దోపిడీ వర్తకులు, మొదలైన పరాన్నజీవులకుమాత్రం కన్నతండ్రిలా కనుపించేవాడు! నాయుడుగారికి కావలసింది అదే అది నిర్విఘ్నంగా సాగిపోతూంది నాయుడుగారికి ఎక్కువ లాంచా తనలాంటివాళ్ళ సంఖ్య హెచ్చుగా కనిపించేది ఈ డబ్బున్న ఘరానా మనుష్యుల జీవితాలు తిరచిచూస్తే, తన చేసేది ఏమీ కాదు అని సమ్మంమను చేసాడాయన!

అదంతా యెందుకొచ్చిందని, తనలాంటి విషయాలు బయటపెట్టకూడదు ఆ వేళ ఆవల బజారు కొమటోరి గురించి, తనకు జరూరి తనగతే. అంతపని చేయించాడు గదా తనకు కుక్కిపడితే తప్పింకో కెలీలేరు తను యిద్దాన్నెక్కు కాని పుట్టుకొంకుండా పని జేసే సానుభూతి జూపిన ఆసామీ ఎవరూ లేరు ఈ గోజున నాలుగురకు పంపాయించి, ఘరానాగా తిరగ్గానే అంతా గౌరవమే!

ఎవరయినా నాయుడుగారిదగర నీతి నిజాయితీల గురించి ఇవ్వాడు మాట్లాడితే పెదవులు విరిచి చల్లగా సమాధానం చెప్పేకే ఒప్పుకుని తీరవలసింది "మూర్ఖుడి, నీతి, నియమం ఉంచటం మంచికే మనజీవితంలో అటువంటి ఎన్నింటి సార్ధకతా లేక ఉంచవలసిన అవశ్యకత ఎంతయినా ఉంది ఎందుకంటే నియమాలయినా ఎల్ల లంఘనం అనవసరం మన ప్రపంచమంతా పూర్తి పోయింది. పాడయిపోయింది. నీతి నియమా లు పాటించేవాళ్ళు చాలా అరుదయిపోయారు అలాంటి సమయంలో ఒకరూ, యిద్దరూ మడికట్టుకొన్నా, నీతి నియమాల్ని, ఉద్ధరిస్తామంటే లాభంలేదు. సరిగ్గా అనాయాసంగా వచ్చి మనిషి చక్కాపోతారు. అంచేత బుద్ధిమంతుడయిన వాడెప్పుడూ, ఒక చేత్తో ఆ మాయను అవసరాగా తీసుకుని, రెండో చేత్తో దాన్ని కెంతా దాలి అంతేగాని మాయమాయ అని అఘోరిస్తే లాభం ఏమిటి?" అంటాడు ధీమాగా.

ఏది ఎలాగున్నా యిప్పుడుమాత్రం నాయుడు గారికి కొంచెం గౌరవం మర్యాద కలిగాయి. ప్రోత్సహిస్తూ, పొగడుతూ, సత్కారాలు చేస్తున్నారు. నాయుడుగారు చాలా సంతోషంగా, ఆనందంగా కాలం గడుపుతున్నారు. దానధర్మాలు చేస్తున్నారు. పెద్దవాళ్లు చిన్నవాళ్లు ఇల్లకు దాన కర్ణుడు అన్నంతవరకు కూడా పొగిడేస్తున్నారు నాయుడుగారిని.

## 2

సరిగా యీ రోజులలోనే నేను నాయుడు గారి దాతృత్వం, కీర్తి విని, ప్రక్కనున్నా యింతవరకు కనిపెట్టలేక పోయినందుకు విచారించాను. నా కష్టసుఖాలు, బాధలు, ఆయనకు బాగా తెలుసు. ఆయన ఆఫీసులో ఏదో గుమాస్తాపని ఖాళీగా ఉందని తెలిసి చేయిందమని అడిగితే—పొరుగువాణ్ణి కూడా చూడకుండా నిక్కచ్చిగా అడిగాడే లంచం! అధికారి ఆఫీసరుని బ్రతిమిలాడితేగాని లాభం లేదని, ఈ మొత్తంలనే అవుతుందని బంట్రోతు కూడా స్పష్టంగా చెప్పేశాడు పాపులా బ్రతుక్కున్న తిరువారి ఆయన కాళ్లా వేళ్లాపడి బ్రతిమిలాడి చెలసినా పదిహేనొప్పున యిచ్చుకుంటానని ఆ నౌకరీలో చేరాను

అయినమాత్రం నాదగ్గర డబ్బుపుచ్చుకోవడం చేతో, మరెందుచేతో గాని నాయెడ దయతివాత్సల్యం ప్రకటించేవాడు తీరిక సమయాల్లో గుమాస్తాయొక్క గురుతర బాధ్యతలు, కష్టసుఖాలు, అనేక సమస్యల గూర్చి సమగ్రంగా ఉపన్యాసాలు దంచేసేవాడు

ఇంకా సంతోషంగా ఉన్నప్పుడు "చూడ్రా అబ్బాయీ! నీదగ్గరలేదో పదిహేనూరూపాయలు పుచ్చుకుంటున్నానని కోపపడకు. అది గుమాస్తా ఉద్యోగ ధర్మం పైపెచ్చు మనవితనం. అసలీ గుమాస్తాగాడి కింతటిక్కడ తెలిమియ్యడం ఎంచేతో తెలుసా. అంచేతే, అందుకే, అలా ఉండకపోతే యీ గుమాస్తా గిరీకదిలేది, సంసారం సాగరంలో తోసిన పక్యావసం పుచ్చుకోవడంమేలు. తెలిసిందా ఈ కిటుకు ఒక్క తెలుసుకుని నీ ఉద్యోగం సక్రమంగా నిర్వర్తించావా అందరికీ మంచివాడివే నీ ఆఫీసరు కూడా అనం టిస్తాడు. లేకపోతే చాలా విచారించదగిన పరిస్థితుల్లో పడి చిక్కుపోతావు. అదిగావానకేమికో నాయనా!" అంటాడు

అప్పటికి నేను చేతులు జోడించి కాలం వెళ్లాంచెసెం పొందరాపెట్టాను అందుకే గాబోలు నాయుడుగారు నేనంటే పడిచచ్చిపోయేవాడు నేనంటే ఆయనకు ఎక్కడలేని తెలియనితేటలా పుట్టేది. మన ప్రభుత్వం నాయకులను పరయింతలేని నక్కృత్యవటీశు దక్కనవ్వేది. ఆయన యొప్పు డయినా అప్లోదంగా ఉన్నప్పుడు నేకనపడితే గాలు. మాకోప్పుడని కప్పు కాఫీయిచ్చి పొందలెవికాడు

"ఇలా చూడరా అబ్బాయీ (నేమాత్రా నే ఉంటాను లెండి) బ్రిటిషువాళ్ళు మనదేశం దోచుకుం గుకవచ్చారు. వాళ్ళకు బలంకొంది దేశం దిగాల్సొ దోచేయడు నేనగు మనసొత్తు శాశ్వత అదే వ్యాపారం అయింది. వాళ్ళని తరిమేశాం ఏదో బ్రహ్మాండమయిన ఉద్యమాలు నడిపి. ఆ ఉద్యమాలలో చచ్చినవాళ్ళూ, త్యాగంచేసినవాళ్ళూ దొంగ? నువ్వూ నేనే అయినా యిప్పుడు నీకూ నాకూ ఏముంది? యిదివరకే ముందో అదే నీకూ నాకూ ఓకానీ ఎక్కువిస్తాయంటే యెక్కడలేని అర్థిక సమస్యలు, విదేశాంగ వ్యవహారాలు అడ్డంవస్తాయి కానీ యీ పరిశ్రమాధికారాలు, భూదానములు, గుత్తేదారులు పెట్టుబడిదారులూ ఎగా డబ్బు చేసేసుకుంటున్నారో! ఇళ్ళమీదయిళ్ళు, కారు మీదకారు, మాటమీద మాట్లు విలాసాలు, సరదాలు, పెళ్ళిళ్ళు, విందులు అన్నీవి ఇవన్నీ చట్ట సమ్మతాలేనా? న్యాయమైనవేనా? ధర్మసంబంధాలేనా? నువ్వూ నేనూ అవడానికి వీల్లేదు నువ్వు "అ" అన్నా వంటే పట్టపరుడిం నువ్వూ, నీ ఉద్యోగం, నీ బ్రతుకూలివాళయి మాడిపోవి అవుతాయి అంచేత నీచాతివయినంతవరకు మనల్నా కో మకుంటూండు ఇది పరమరహస్యం సుమా! మనయిదరి మధ్య అంతరంగిక సంభాషణగా భ్రమే ఎటొచ్చీ వాళ్ళకు నీకూ తేడా ఏమిటంటే చటం వాళ్లని రక్షిస్తుంది నన్ను భక్షి స్తుంది అంతే"

"ఈ పరిస్థితులున్నంతవరకూ నువ్వూ నేనూ కుడిగట్టుకు కూర్చుంటే వశించిపోతాము. అయినా గాని మనము చేసేది ఒకటెక్కడ ప్రైవేటితో పొలిస్తే ఈ సాంతివ్యాపారాలు, ఎర్రిక్రమలు, డబ్బుచేసుకోడాలు, ఉన్నంతవరకు, నన్ను నువ్వు, నిన్ను మరోడూ, మనంతిన్నీ యింకోడూ గొల్లగొట్టుకోడం ఎలా పోతుంది ఏకాలంలో నైనా ఒకట్టే మగడు పోసించుకు తినడాన్ని ఈ సంఘం సమర్థిస్తూ, చట్టాలు రక్షిస్తూ ఉంటే యీ దగాలుపోవు. మరికొట్టుకు మూర్ఖులా మువ్వూ నేనూ కూర్చోడం చట్టవిరుద్ధం అది నేరమే!" అని ముగించేవాడు ఉపన్యాసం.

ఆయన చిరునవ్వూ అప్పటి ప్రవర్తనా మా వీతిన్న తాను మెచ్చుకుంటూ ఉంటాడని లేలికగా అర్థమవుతుంది నాకు మాత్రం అది వింటూ న్నప్పుడు అంతా పరమంజసంగా కనిపించేది.

నవ్వేంకోసం ఒకడిని మరోడు దోపిడిచేసు కోడాన్ని అంతమొందించి, కష్టపడేవాళ్ల శ్రమను తిను

మినహాయిస్తే ఫలహారం మాత్రమే. మధ్య మధ్య ఏకాదశి ఉపవాసాలు, పూజలు యింటిదగ్గర భక్తులందరినీ పోగుచేసి భజనలు కూడా చేయించడం మొదలు పెట్టాను. కనిపించిన దేవుడి కల్లా నమస్కారం పెట్టాను కనిపించని దేవుణ్ణి భక్తితో కొల్వడం ఆరంభించాను. ఆఖరికి ఆకేసులో నాయుడు గారికి జీవితాంతం ఖైదు వేయించేందుకు గాను ఆ భగవంతుడికి నా తలమీద వెంట్రుకలు, గడ్డము మొగుకట్టి మొక్కుకున్నాను

నాయుడు గారి కేసునుగురించి చాలా ఆత్రుతతో తెలుసుకుంటున్నాను ఈ మధ్య ఆయన కేసు గురించి వింటూంటే నాకు చాలా విచారం, కోపం, పొంగుకువచ్చాయి "ఇంత భక్తితో కొలుస్తున్నా, భగవంతుడికి దయ లేదా!" అనుకున్నాను. దేవుడు నమ్మిన వాళ్ళను మోసం చెయ్యడుట ఏదో వేషం వేసుకు వయినా సరే వచ్చి భక్తులని రక్షించి తీరతాడని శ్రుతిస్మృతులు ఘోషిస్తున్నాయి. అయినా "నేడో రేపో తెలుస్తుంది దేవుడి సంగతి!" అనుకునే వాడిని

ఒక్కొక్కసారి నాయుడుగారి ప్లీడరుగారి సంగతి వింటూంటే, అసలు దేవుడనేవాడు ఉన్నాడా అనే సందేహానికి కూడా తావొచ్చింది నాయుడు గారి ప్లీడరు అఖండ ప్రతిభావంతుడట! చాలా గట్టివాడట ఎదుట వారిని తినేస్తున్నాడుటంతే! అతడు అడ్డు ప్రశ్నలో అఖండుడట. ప్రతికక్షులు ఆయన యొక్క ప్రశ్నలకి జవాబు తీయలేక పరుగు లంకించుకున్నారట! యివీ వార్తలు!

దేవుడి మీద కోపం ముంచుకు వచ్చింది. "అయినా నేడోరేపో తెలుస్తుంది దేవుడి సంగతి అప్పుడు చెప్తాను ప్రపంచం అంతా చాటేస్తాను. తర్వాత చూసుకుంటా" ననుకునేవాడిని నేను అలాగే తేలింది దేవుడున్నాడా లేడా? అనే ప్రశ్నకు నిలువు జవాబు.

నాయుడుగారికి ఆరునెలల కఠిన కారాగార వాసం విధించారు

"రక్షించావు దేవుడా!" అని వేయినమస్కారాలు చేశాను చేసిన పూజలు పెట్టిన నమస్కారాలు ఊరికే పోతాయా!

ఇంక దేవుడి మొక్కు తీర్చుకోవాలి. వెంటనే బయలుదేరి వెళ్దామనుకున్నా కాని చాలా రాత్రి కావడంవల్ల మానేశాను మరునాడుదయాన్నే బయలుదేరి పురోహితుడి యింటికి వెళ్ళాను తొందర్లో అడవిలాంటి నా గడ్డాన్ని వదలిపెట్టడానికి తయారవడం కష్టంగానే ఉంది.

అయినా యిది భగవంతుడితో వ్యవహారం ఆయన ముందా మనదాటులు విచారంతో గడ్డాన్ని, ప్రేమతో పిల్లదూడలాంటివాట్ని నిమురుకున్నాను ఆ విచారంలో నా కళ్ళలోనుండి ఒకటి రెండు అశ్రుకణాలు దొర్లాయేమో నాకు తెలీకుండా ఇలా నాలో నేను బాధపడుతూంటే, శాస్త్రిగారు తన కార్యాన్ని మొదలుపెట్టారు.

"మాకారా" అన్నాడాయన నన్ను చూడగానే

"ఆ! ఏమిటి?" అంటూ ఉలిక్కి పడి ముందూ వెనకా చూశాను

"ఏమీ లేదండి" అన్నాడు శాంతంగా ఆయన ధ్యానం చూచేసరికి నాకళ్లు మండింది

"ఏమీ లేకపోతే ఏం చూడమన్నారయ్యా!" అన్నా విసుగ్గా

"అబ్బే! ఏమీ లేదు ఆ ముసలిముండా వాడు చాలా మంచివాడు"

"ఆ ముండావాడికో కొత్త పెళ్ళిద్దరూ బాబూ"

"ఆ నాయుడుగారండీ! చాలా సద్గుణుడు తనకు యీ ఉద్యోగం ఆయనే వేయించారుటగా! ధర్మాత్ముడు"

"అదే తమబోటి పెద్దలు చెప్పుకుంటున్నారీ ఊరిలో" అన్నా కోపం పటలేక.

"మంచివాడికే కష్టాలన్నీను" అని పెదవి విరిచి, బల్లి అరిచినట్టు చప్పుడు చేసి "ఇంకేమిటిలెండి లాభం! ఉద్యోగమూ పోతుంది. శిక్ష అనుభవించాలి" అన్నాడు తన సానుభూతి యీగర్తూ మాటలద్వారానే గాకుండా ముఖంద్వారా కూడా ప్రకటిస్తూ

"అద్భుతంలే మరి!"

"అయినా పెద్ద కోర్టు కెళుతాడుటలెండి."

"అయితే యింకా నాశనమవుతాడట!" అన్నా నా ఆనందం కప్పిపుచ్చడానికి ప్రయత్నం చేస్తూనే

"ఏమో మరి"

"పెద్దకోర్టు కెళ్ళడం అనవసరం. ఏదో ఓ చిల్లి గవ్వ యింట మిగిలితే అది ఖర్చుచేసుకోవడం ఒక్కటే జరుగుతుంది"

"నేనూ అదే చెప్పానండి నాయనగారికి విన్నవిస్తే"

"చాలా సేపయింది వెళ్ళొస్తా" నంటూ ఓ నమస్కారం ఆయన మొహాన్ని కొట్టేసి బయలుదేరాను యింటివైపు.

"అయితే బాబుగారూ!" అన్నాను ఆయన మొక్కుబడిసంగతి అడుగుదామని

"ఇంకానన్ను గుర్తుపట్టలేదుటండీ" అనిఆయన—

"ఆయన మీబాబుగారుకాదండీ' అని నాచెవిలో ఊదావిడ, అనడం ఒకేసారిగా జరిగాయి

ఆశ్చర్యంతో పరికించిచూద్దును యింకేముంది? మా గురువుగారు! నాయుడుగారే!

"మీరా!" అన్నాను దిగ్భ్రమచెంది

"నేనేనోయి కేసు గెల్చాను వచ్చిచెడి" అన్నా డాయన ఆనందబాష్పాలు రాలుస్తూ

నా ప్రాణంమాత్రం అలా మిగిలించి యెగిరి పోయింది!

"నాపోస్టింగ ఆర్డరుకూడా ఇచ్చేశారు!" అన్నా రాయన సంతోషంగా

నాపరిస్థితి జ్ఞాపకంవచ్చి ఆయన్ని పిక పిసికే ద్దామా అన్నంతకోపము, అవమానము పుట్టుకొచ్చాయి అంత క్రోధంలో యేమీ మాట్లాడలేకపోయాను

"ఇంత క్రోధివాడవుగదా! నీ కెలా యిచ్చారోయి నాఖాళీ ఉద్యోగం?"

"మీ చలవవల్లనే నేను మీ అనుగ్రహాల్లో నడిచాను. అంతే!"

ఆయన కూడా లేత నవ్వులు పెదవుల్లోంచి వదులుతూ ఓ కాయితం ఇచ్చాగా, నన్ను చూడ మంటూ ఆయనకు అధికారపదవి యిచ్చాగా నన్ను మాత్రం ఆ పెద్దకుమస్తా పదవిలోంచి తీసెయ్యలేదు అదే పదివేలనుకున్నాను

"ఈ గడం, యిదంతా యేమిటి?" అన్నా డాయన

"తమర్ని యీ చిక్కునుండి తప్పించేందుకు గాను గవుడికి మొక్కుబడి" అన్నాను

"సెబాష్ ఇదంతా గవుడిదయే సంగతేమిటి? నేనూ యీ కేసునుండి బయటపడెయ్యమని ఆగవుడికి మొక్కుకున్నాను"

"అయితే యీ గరుడపురాణాన్ని గనం యిద్దరం యీ మొక్కుబడులు తీర్చుకుందాం రండి" అన్నాను నవ్వుతూ

"అలాగే పదవోయి" అన్నా డాయన

"అయితే గురువుగారూ! కొంపతీసి మిమ్మల్ని మగ్గొట్టుడు లాక్కొళ్ళి మళ్ళీ మగ్గలా తిర్పి చెప్తారేమో!" అన్నా సంతోషంతో

"ఆదంతా పిచ్చి! తెలుసునోయ్ మన తిర్పతి తిరుగులేదు తెలుసునా! యిదే సిరి! ఉన్నత వ్యాపస్థానం!" అన్నా డాయన ధీమాగా

ఈ సుషుమ్నా నాడిలో అంతరతమై ఉన్నదని ప్రాణాలు సుషుమ్నా నాడి పర్వతముల మీద దట్టి టచే వస్తాయి అని అన్నారు సుషుమ్నా నాడి ఊర్ధ్వ మూలం కలిగి అగ్రాలు కలిగి ఉన్నది దీనియందే డెబ్బది రెండు వేల నాడులు శరీరమంతటా వ్యాపించి ఉన్నవి భగవద్గీతలో అశ్వత్థవృక్షమున కొన్న వర్ణన, ఈ సుషుమ్నా నాడి కింద వున్నది అశ్వత్థవృక్ష మనగా సుషుమ్నా నాడియే అని నా అభిప్రాయం. భగవద్గీతలో, ఆదిలో వ్రాయబడ కొన్ని విషయాలు తీసివేయబడి ఆదిలో లేని కొన్ని నూతన విషయాలు చేర్చారంటారు ఇందులో ఊర్ధ్వమూలం, అగ్రాలు అని సుషుమ్న వర్ణించబడ్డది కాని కుండలిని అనే శబ్దం లేదు జ్ఞానేశ్వరు భగవద్గీత 6 వ అధ్యాయంలో కుండలిని గురించి చెప్పారు ఒక్కొక్కరు, వారి వారి అనుభవముల ప్రకారం అనేక పేర్లతో పిలిచారు సుషుమ్నా నాడిని ఈ నాడినే శూన్యపథం బ్రహ్మరంధ్రము, మహాపథము, శ్మశానము, శాంభవి, మధ్యమార్గము, సరస్వతి అని పిలిచారు ఇది శబ్దస్వరూపిణి. మంత్రస్వరూపిణి, ప్రాణస్వరూపిణి, జ్యోతిస్వరూపిణి ఇది కదలగానే జ్యోతిర్దర్శనములు కలుగును

డాక్టరు రేల్ సుషుమ్నా నాడి వాగస్ నర మన్నారు

## ఇడా పింగళా నాడులు

సుషుమ్నా నాడి తర్వాత ముఖ్యమైన నాడులు ఇడా పింగళానాడులు ఇవి వెన్నెముకను ఆశ్రయించి వున్నవి వెన్నెముకకు కుడివైపున పింగళానాడి, ఎడమవైపున ఇడానాడి ఉన్నది కుడిముక్కు రంధ్రమునది పింగళానాడి ఎడమ ముక్కు రంధ్రమునది ఇడానాడి. పింగళానాడియందు సూర్యుడున్నాడు. ఈ నాడి ఉష్ణమువల్లను వేడి చేయును ఇడానాడి యందు చంద్రుడున్నాడు ఈ నాడి వశమువల్లను చల్లదనం చేయును ఈ రెండు నాడులు కాలమును తెలియచేయును సుషుమ్నా నాడి కాలమును భ్రమింపును. యోగసాధన సుషుమ్నా నాడి వశమువల్లను చేసిన యోగసిద్ధి త్వరగా లభించును సమాధిలోనివారికి కాలం తెలియదు. నాడులను స్వాధీనం చేసికొన్న వారు, తమ కర్మ ఫలితములను తమ ఇష్టం వచ్చినట్లు త్రిప్పగలరు యమధర్మరాజును ధిక్కరించిన వీరు లున్నారు ఈ నాడు కూడా కుండలిని సహస్రారం చేరుటకు త్రిగ్రంథులను భేదించవలసి వున్నది మూలాధారమువద్ద బ్రహ్మగ్రంథి ఉన్నది. మణిపూరము వద్ద విష్ణుగ్రంథి ఉన్నది విశుద్ధవద్ద రుద్రగ్రంథి వున్నది మాయాశక్తి ఈ ఔ గ్రంథులవద్ద బలంగా వున్నది కాని మణిపూరచక్రంవద్ద ఎక్కువ బలంగా ఉన్నది. ఈ గ్రంథులను భేదించునప్పుడు భరించరాని బాధ కలుగును సద్గురుకృప ప్రాణాయామంవల్ల గ్రంథిత్రయమును భేదించవచ్చును

సుషుమ్నా నాడి కొన మూలం కలది. అనగా దీని మూలం సహస్రారచక్రంలో వున్నది. సహస్రార చక్రమును గురించి తెలిసికొనుట చాలా ముఖ్యం

## సుధాబిందువు

సహస్రార చక్రము అధోముఖమై వున్నా దాని కర్ణిక ఊర్ధ్వముఖంగా ఉన్నది ఇక్కడ శ్రీచక్ర మున్నది ఇది ప్రకృతి స్వరూపిణి మహాలక్ష్మి ఇక్కడ చంద్రమండల మున్నది దీనిలో గురుపీఠ మున్నది ఈ గురుపీఠమును, హంసపీఠమని, మణిపీఠమని అంటారు గురువు, హంస ఇందులోనే వున్నారు వీరిని ధ్యానం చేయవలసింది ఈ గురువు శ ఇది మణివలె దేదీప్యంగా మెరుస్తూ వుంటుంది ఈ పీఠమందు గురువు ఆసీనులై, ముక్తినిస్తుంటారు గురువు అసలు ఆజ్ఞాచక్రంవద్ద నివసిస్తూంటారని కనుక దానిని ఆజ్ఞాచక్రమన్నారు. సహస్రారంలో ఉన్న చంద్రమండలమును బిందుస్థాన మంటారు ఇదే సుధాబిందువు ఇక్కడనుండే అమృతము వర్షించు చుండును కుండలిని మేల్కొని సహస్రారం చేరి, అందులోని చంద్రుని కాటు వేయును అప్పుడు చంద్రునినుండి అమృతం క్రిందికి ప్రవహించును ఆజ్ఞాచక్రం వద్ద ఇంకొక చంద్రుడున్నాడు పై అమృతం ఈ చంద్రుని తడుపును ఇక్కడినుండి అమృతము శరీరమంతటిని తడుపును సహస్రారంలోని చంద్రునికి 16 కలలున్నవి కలలనగా పరమాణువు ఈ 16 కలలలో, 15 కలలు కాలమును తెలుపు తిథ్యాత్మకాలు మిగిలిన 16 వ కళ, వృద్ధి క్షయం లేనిది విభాగము లేనిది దీనిని ధ్రువకళ అంటారు. ఇదే ఆత్మకళ, చిత్కళ, త్రిపురసుందరి ఇదే శైంద స్థానము పార్వతీ పరమేశ్వరులు ఐక్యమగు చోటు ఇది ఇది విశ్వాత్మతో జీవాత్మ కలియుచోటు, సచ్చిదానందము కలుగుచోటు. జీవులు కోరే ముక్తి శాంతిని పొందుచోటిది. సహస్రారం దగ్గర బ్రహ్మరంధ్రం వున్నది. దీనిని దశమద్వార మంటారు. శరీరంలో బ్రహ్మ ప్రవేశించుచోటిది మూర్ధము, శరీరం నుండి వెడలు చోటూ ఇదే. ఇక్కడ శూన్యసీమ వున్నది. నిర్వికల్ప సమాధి కలుగుచోటు ఇదే. శ్రీ అరవిందులు ఊర్ధ్వమనస్సు Over mind సహస్రార చక్రంలోను, లోమనస్సు Inner mind ఆజ్ఞాచక్రంలోను ఉన్నదని వ్రాశారు సహస్రార చక్రం *Pineal* gland దగ్గర, ఆజ్ఞాచక్రము Pitutary gland దగ్గర

# కుండలినీ శక్తి: కొన్ని అనుభూతులు

అది మణిపూరంవరకువచ్చి తిరిగి క్రిందికి పోవచ్చును. మణిపూరమునకు కుండలిని చేరినటు సాధకునకు కొన్ని గుర్తులు కనుపించును నక్షత్రములు, మెరుపులు పురుగులవంటి జ్యోతులు కనుపించును

కుండలిని మేల్కొని మూలాధారచక్రమును విడిచి పైకిపోవునని కొందరు అంటారు. కొందరు అసలు కుండలిని మూలాధారంలోనే ఉంటుందనీ దాని జ్యోతియే పైకి వస్తుందనీ అంటారు. కుండలిని ఒక్కొక్క చక్రమును విడిచి పైకిపోవుచున్నట్లు, ఆయా చక్రములలోని శక్తిరూపములను, వేడిని గ్రహించి పైకిపోవును ఈ విధంగా క్రింది 5 చక్రములలోని పంచభూతములను, అజ్ఞలోని మనస్సును, శివలో లయింపచేసికొని ఇది సహస్రారంచేరును ఇట్లు లయింపచేసికొనుటకే లయకర్మ అనీ, లయ యోగమనీ అంటారు అధోముఖములైఉన్న చక్రములన్నీ, తిరు గుడు పువ్వు గాలికి ఎటుంటేఅటు తిరిగినట్లు, పైన వున్న కుండలిని వైపుకు తిరుగును

## అనుభూతులు

కుండలిని మేల్కొన్నటు సాధకునికి కొన్ని గుర్తులు కనుపించును ఆనందము, కంపం, ఉత్సాహం, ప్రకోపం, నిద్రలు కనుపించును

పైకివెళ్లిన కుండలిని క్రిందికి దిగివచ్చునప్పుడు, చక్రములలో తాను గ్రహించిన వాటి నన్నిటిని తిరిగి ఇచ్చివేస్తూ మూలాధారమునకు చేరును. దానితో శరీరము ఉష్ణహీనమై, కట్టెవలె ఉండును కుండలిని క్రిందికిరాగానే ఉష్ణము కలుగును దీనిని సృష్టికర్మ అంటారు కుండలినీ సహస్రారం చేరినప్పుడు, అనేక మందికి, అనేక అనుభూతులు కలిగినవి ఇందులో జ్ఞానేశ్వరుడు పొందినది ముఖ్యం. ముందు వీరి అనుభూతులను మనవిచేస్తాను.

## జ్ఞానదేవుని అనుభూతి

సిద్ధాసనమువేసినందువల్ల కుండలినీమహాశక్తి మేల్కొని, మణిపురచక్రము చేరును. అక్కడ గొప్ప అలజడి చేయును ఇందుకు భయపడరాదు అక్కడఉన్న మేదోమాంసరక్తములను ఇది హరించును దీనివల్ల జబ్బుచేయును. ఈ జబ్బు కుండలినియే నయం చేయును ఉద్యానబంధంవల్ల, కుండలి మణిపూర చక్రంవద్ద బిగించబడి ఉండును మణిపూరచక్రంలోనికి చేరిన కుండలిని, విద్యుత్కణంవలె, అగ్నిజ్వాలలు గల గొలుసులవలె, మెరుగుపెట్టిన సువర్ణపాత్రవలె ప్రకాశిస్తూండును ఇక్కడనుండి, వళ్ళు విరుచు కున్నట్టులేచి, హృదయంలో మాంసం కొద్దిగాను, శరీరములోని మాంసము మరికొంచెము తిని, దప్పిక కలిగి ఉండును. ఇందుచేత రక్తం మొదలైన సప్తధాతువులు ఒక్క గుక్కలో త్రాగివేయును. అప్పుడు శరీరం కుశించును ముక్కువెంట వెడలు 12 అంగుళాల వాయువు కూడా నశించును మధ్యచక్రం మిగులును అప్పుడు కుండలిని విషం కక్కును ఈ విషం ప్రాణవాయువుకు అమృతప్రాయంగా వుంటుంది ఇందుచేత ప్రాణం నిలిచివుంటుంది. అంతకుపూర్వము, గ్రీష్మంలో వున్నట్లున్న శరీరము చల్లబడును కుండలిని తాను భక్షించిన స్థానములకు తిరిగి శక్తినిచ్చును ఇడాపింగళలు ఏకమౌను త్రిగ్రంధులు ఛేదించబడును షట్చక్రములమీది ఆవరణ తొలగును మది చాంచల్యంపోవును చంద్రుని అమృతతత్త్వం కుండలిని గొంతు పడి, అవయవములకు వ్యాపించును. శరీరమునకు బంగారు కాంతివచ్చును ఆనందసుఖములు కలుగును యౌవనవంతుడగును నూతనంగా గోళ్లు వెంట్రుకలువచ్చును తర్వాతకుండలిని అనాహత చక్రంలో ప్రవేశించును అప్పుడు అనాహతశబ్దములు వినిపించును. తర్వాత మిగిలిన ప్రాణవాయువును మ్రింగును. ఇప్పుడు నాదం వినిపించదు తేజస్సు కనుపించదు. సంకల్ప వికల్పాలులేవు అతని ఎదుట అణిమాదిసిద్ధులు నిలుచును. పృథివి జలాగ్నులు నశించగా వాయువు వుండును శరీరము వాయుప్రాయమౌను. అప్పుడు సాధకుడు ఆకాశగమనం చేయును కుండలిని పేరు పోయి మారుతం అనే పేరువచ్చును. తర్వాత జాలంధరబంధం విడువగా, కుండలిని బ్రహ్మరంధ్రమైన సహస్రారచక్రం చేరును సోహంభావంతో బ్రహ్మభావం కలుగును

జ్ఞానదేవు కుండలిని సహస్రారం చేరుట, పాము కాటువలె వర్ణించాడు భగవద్గీతలో అర్జునుడు శ్రీకృష్ణ భగవానునితో 'విశ్వరూపము నే సర్వం కాలంధించుండుట శరీరము నిర్జీవంకాకుండా ఆవేశం తగ్గించుటకు కావలసినశక్తి నీయందున్నదని అన్నాడు. ఇంతముఖ్యం భగవానుని కరుణ ఇది లేనప్పుడు ఎంతటి సాధన నిర్జీవంవలె ఉండును.

## శ్రీ రామకృష్ణుని అనుభూతి

శ్రీ రామకృష్ణ పరమహంస తనకుండలినీ సిద్ధి అనుభవాలను ఈ విధంగా చెప్పారు కుండలినీ కదలగానే, ముందు పాదములలో ఏదో ఝల్లుమంటున్నట్లుండును ముందు అది చీమలబారువలె నడచును మెల్లగా తర్వాత కప్పగంతులు వేసినట్లు వేస్తూ నడచును తర్వాత పాముమెలికలు తిరిగి నడచునట్లు నడచును పక్షివలెనెగురును. కోతివలె కొమ్మమీద నుండి ఇంకొక కొమ్మమీదకు దూకినట్లు దూకును. కుండలినీ అనాహతచక్రం చేరుట చేరగనే మాట్లాడలేకుందును. తర్వాత మాట కట్టుపడుతుంది అనాహత చక్రం చేరినప్పుడు దివ్యజ్యోతులు కనుపించును. వాటినిచూచి ఆనందాశ్చర్యములు పొందును ఆజ్ఞాచక్రం చేరినతర్వాత భయమునేదివుండదు. ఆజ్ఞాచక్రం

ఎన్ని షరతులు విధించినా ఆ నాటి ఆదుర్దా తగ్గదీ కుదుర్తాయని ప్రవేశించారో యీనాడు పాపుకొగు వియతలదలేదని అభ్యోరించి వాళ్లదగ్గ వాళ్లదగ్గ సామాన్లు యెట్లా చేస్తున్నాడని చెప్పుకోవడం కూడా పొరపాటేనని గ్రహించిన గోపాలం యెవ్వరితోనూ యేమీ చెప్పకూడదనుకున్నాడు

ఈ రోజు యెనిమిదివందల రూపాయలు మొలలో ఉన్నాయి ఒక రూపాయి పెట్టే పాలడబ్బా కాని నాలుగురూపాయల బియ్యంకొని యింటికి పట్టుకుపడితే ఈ అయిదురూపాయలకి రేపు జమా ఖర్చు చెప్పాలి ఒకటవ తేదీ యింకా పదిరోజులకి గాని రాదాయె. వెనక ఒకటవ తేదీ ముప్ఫయి రోజులు గడిస్తేగాని రాదుగదా ఈ ముప్ఫయి రోజులయినా బురదపాము వందంగా నడుస్తాయి. కనిపెట్టుకున్నప్పుడు ఆ ఒకటవ తేదీ వస్తుందన్న మాటేగాని గ్రాచుపాములా జ్వగుడ జారిపోయి ఉడుకుంటుంది పదిహేను రోజులకోసారి ఒకటవ తేదీ వస్తూంటే బాగుండు ననిపించింది గోపాలానికి. ఏమయినాసరే బియ్యం పాడవక్కా కొనుక్కు వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు లేకపోతే యెట్లా? తనతో ఉద్ధరిస్తాడని జీవితాంతం పోషిస్తాడని నమ్మి మెడలో పుస్తెకట్టించుకున్న భార్యకు బియ్యం లేకపోయాయని ఏ ముఖం పెట్టుకు చెబుతాడు.

ఇంతకీ పెద్దవాళ్ళకి బుద్ధిలేదు చిన్నతనంలోనే సుఖపడదని మెసగేసి వాళ్లబాధ్యత వాళ్ళు తీర్చుకుంటే సరేననుకున్నారుగాని తరువాత వచ్చే గోపాలం బాధలు కొంచెమైనా గమనించగలరా? అయితే ఒకటి. కాలమానపరిస్థితినిబట్టి ఇప్పుడెంత తెచ్చినా చాలడం లేదుగాని గోపాలం చిన్నతనంలో వాళ్ల నాన్న ఎలిమెంటరీ స్కూల్లో మాస్టరీ చేసేటప్పుడు నెలకు పదిహేడున్నర జీతం యిచ్చేవారు ఆ డబ్బుతో పదుగురు పిల్లలతో సంసారాన్ని యీదుతూ అప్పుడప్పుడు ఒక్కొక్క కాసు బంగారం (అప్పుడు కాసెంత? పదమూడున్నరేగా) కొని గోపాలం తల్లికి చెల్లెళ్ళకి ముగుసులనీ మెళ్ళో యేదో అంత చేయించి చేయిస్తూఉండేవాడు ఇప్పుడు గోపాలానికి నాలుగు నెలకు అరవై రూపాయలు యిస్తారు. తాను భార్య యిద్దరు పిల్లలు బ్రతకడం కష్టం అయిపోతోంది ఇదివరకొక్క తడవ తీర్చుకునుచచ్చి చెడి యీడ్చుకొస్తున్నాడు అక్కడినుంచి నెలాఖరు వరకు రోజూ యేకాదశులు, శనివారాలు, కార్తీక సోమవారాలు. ఎవరినీ చేయిచాచి అడగలేక గోపాలం చిన్నతనంలో "ఈ రోజుల్లో పెళ్ళాన్ని పోషించుకోలేనివాడు దేవుడు!"

అనేవాడు అప్పుడు జీవితం అంత తేలికగా ఉండేది. ఇప్పుడెంత బరువైందో గోపాలం లాంటివాళ్ళకే తెలుస్తుందిగాని తక్కినవాళ్ళకేం తెలుస్తుంది

తనూ తన భార్య ఏ పనులు పడుతునో జీవితాన్ని గడిపేద్దామనుకుంటే వీలులేకుండా ఇద్దరు పిల్లలు కూడాను గోపాలం దరిద్రానికి సాయం భార్య కోపానికి వచ్చి యెందైరోజుల్లయితే యిప్పుడు పుట్టుకొస్తున్నారు పిల్లలు, ఏది తక్కువయినా పిల్లలు పేచీ పెడ్తారు కదా వాళ్ళకేం కావాలి సంసారంలోని బాధలు పెదపిల్ల బృంద చూచినదగ్గా కొంచెం యేడుస్తుంది ఇంక గంటేపిల్ల కవన్నీ తెలియవు పాలు లేకపోతే యేడుస్తుంది పసు పసుకు తల్లిదగ్గర పాలెలా ఉంటాయి?

పిల్లల భవిష్యత్తుకోసం బల్లలుగుద్ది ఉపన్యాసాలిచ్చే అగ్రనాయకులు చేసిందేమిటి? గట్టిగా అడిగితే తిండి పెట్టలేనప్పుడు యెందుకు కనాలి? సంతాన నిరోధానికి అనేక సాధనాలున్నాయిగా? అదరణలో పెట్టకూడదా అంటారే గాని జీవన ప్రమాణం పెంచ్చినందువల్ల తిండి పెట్టలేకపోతున్నాడనే ఆలోచన రాదుగా జీవన ప్రమాణం పెద్దదానికి కారణం ఏమిటీ అంటే స్వాతంత్ర్యం వచ్చింది గనుక దేశంలో అన్ని విషయాలు ప్రణాళిక పద్ధతిలో నడుపుకునేసరికి కొంత కాలం పడుతుంది 'మేము మా నాయకులా తంటాలు పడుతున్నాము పంచవర్ష ప్రణాళికలు అమలుపరుస్తున్నాం ఒక్కొక్క రాష్ట్రానికి రెండు, మూడు విశ్వవిద్యాలయాలు స్థాపించి విద్యాభివృద్ధి చేస్తున్నాం' అంటారేగాని దిగమింగుకు దీనతలు అంతుల్లేకుండా యెంత మింగేస్తున్నారో, ఎందరు పాపకాలరాయుళ్ళు పావకంలాగ తాగేస్తున్నారో, ఎంత దుబారా ఖర్చుల క్రింద జీవిలాపాల క్రింద ఖర్చవుతోందో, ఎన్ని అనవసరమయిన టూర్లు క్యాంపులు జరుగుతున్నాయో? తెలియని గనుకనా? అందరికీ తెలుసు! అయినా ? కెవ్వరికీ మాకేం అది సాధ్యకాని సమస్య పైకి చెప్పడానికి వీలులేని సర్వ ప్రజానీక తెలిసికూడా తెలియనట్టు నటించవలసిన రాజకీయ రహస్యం బయటపెడితే ముందటికే మోసం వచ్చే చిదంబర రహస్యం. మనకెందుకు పోనివ్వండి.

అనేక ఆలోచనలు బుర్రలో పరుగెత్తుతున్నాయి గోపాలానికి పాప పోనీపోటితో నాన్న పాలడబ్బా తెస్తాడని ఎదురుచూస్తూ ఉంటుంది వట్టిచేతుల్తో తాను వెడితే పాలడబ్బా కూడా కొనలేనివాడవు కన్నాం దుకు కనాలి? వందనోద్యాపనం కావలసిన నా జీతాన్ని మొలకెత్తేసరికి కుంపెట్యడలుచుకున్నానా?

కన్నీళ్ళతో నే వంటయింటి ముఖ్యంలోనికి వెళ్ళింది. పిల్లి మూతి నాకుకుంటూ దొంగ దొంగగా వచ్చింది సుగుణ చూచింది గుండె గుభేలుమంది. మూత పడగొట్టి మజ్జిగ కాస్తా పిల్లి తాగేసింది కళ్ళ నీళ్లు గిర్రున తిరిగాయి అక్కడే కూలబడింది. ప్రొద్దుటినుంచీ యిద్దరికీ తిండిలేదు భర్త యింటికి వచ్చాక ఒకవేళ బియ్యం దొరక్కపోతే యిద్దరూ కాస్త మజ్జిగ త్రాగి యీ రోజు గడప వచ్చుననుకుని, మధ్యాహ్నం ఆకలిబాధ అణుచుకోలేక పోయినా మజ్జిగ త్రాగకుండా అలాగే అట్టే పెట్టింది భర్తకు పట్టుకు వస్తానని చెప్పి లోపలికి వచ్చింది ఏ ముఖం పెట్టుకు భర్త దగ్గరకు వెళుతుంది? ఏమని చెబుతుంది?

పాప పాలులేక తొట్టిలో ఏడుస్తోంది ఎంత సేపటికి మజ్జిగ తీసుకు రాకపోవడంచేత గోపాలం 'సుగుణా!' అన్నాడు జవాబు రాలేదు ఉదయం నుంచీ భోజనం లేకపోవడంచేత కళ్లు తిరిగి పడిపోయి ఉంటుందేమోనని కంగారుపడి వంటయింట్లోకి వచ్చాడు సుగుణ ముఖం రెండు చేతులలో దాచుకుని ఏడుస్తోంది.

'ఏమిటి సుగుణా' అన్నాడు ధైర్యంగా

'పిల్లి మజ్జిగ కాస్తా తాగేసింది' అంది ఏడుస్తూ సుగుణ.

ఇంతమాత్రానికి ఏడుస్తారా! పోనీలే పాప ఏడుస్తోంది అపాలు కాసిన్ని పొయ్యరాదూ?" అన్నాడు

లేచింది సుగుణ. పాలగ్లాసు తీసుకుంది పట్టుకు వచ్చింది పాపని లేవదీసి పాలుపొయ్యడం కోసం కాళ్లమీద పడుకోబెట్టుకుంటోంది. పాప చేతులు కాళ్లు కొట్టుకుని ఏడవడంలో చెయ్యితగిలి ఆ పాల గ్లాసు పడిపోయింది

అయ్యోఅని అరిచింది సుగుణ. తల గోడకేసి కొట్టుకు ఏడుస్తోంది పిల్లకి ఆ పాలుకూడా పట్టలేక పోయానే అని

గోపాలానికి నవ్వు ఏడుపు రెండూ కలిసి వచ్చాయి. కళ్ళవెంట కన్నీళ్ళు కారుస్తూ నవ్వుతున్నాడు.

ఏడుస్తూనే ఎందుకు నవ్వుతున్నారంది సుగుణ.

"ఎందుకా? జీవిత మాధుర్యం అంటే ఏమిటో యిన్నాళ్ళకు తెలుసుకున్నాను నాకు జీవితపు లోతుల్లో ఉండే అందం కనిపిస్తోంది సుగుణా! ఎంత విచిత్రమైన సంఘటన మన జీవితాంతం మరచిపోగలమా! కష్టాలున్నప్పుడే సుఖాలయొక్క నిజమైన విలువ తెలుస్తుంది సుగుణా జీవితపు లోతుల్ని తరచి చూచిన వాడే నిజమైన జీవిత మాధుర్యాన్ని పొందగలుగుతాడు సుగుణా! నిజమైన జీవిత మాధుర్యం అనే పదానికి సరియైన అర్థం ఈ మన విచిత్రసంఘటనే సుగుణా!" అన్నాడు

సుగుణకు యేం అనాలో తెలియక ప్రశ్న కప్పగించి చూస్తోంది గోపాలంవంక

కాళ్లమీదవున్న బోసినోటి పాప నైరాశ్య రహితురాలైవున్న సుగుణ కాళ్లమీదనుంచి దొర్లిపోయి ఒలికిన పాలల్లోపడి రెండు చేతులతో తపతప కొడుతోంది అవ్యక్తమైన ఆనందంలో బోసినోటితో కలకల నవ్వుతూ తల్లివంక చూస్తోంది

ఆ మాటలతో తేరుకున్న సుగుణ ఒక్కసారి పాపను తీసి గుండెలకు హత్తుకుని చిరునవ్వు నవ్వింది

# కలగూరగంప

## ఆచార్య శిశిరకుమార్ మిత్ర

శ్రీ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి



ఇటీవల బ్రిటిష్ రాయల్ సొసైటీవారు యిద్దరు ప్రముఖ భారతీయ భౌతిక శాస్త్రవేత్తలను సభ్యులుగా ఎన్నుకొనిరి. వీరిలో ఒకరు ఆచార్య ఎస్. ఎన్. బోస్ వీరు చాలకాలము కలకత్తా విశ్వవిద్యాలయము ఆచార్యులుగానుండి, ప్రస్తుతము విశ్వభారతి శాంతినికేతనమునకు ఉపాధ్యక్షులుగానున్నారు. రెండవవారు ఆచార్య శిశిర కుమార్ మిత్ర.

శ్రీ శిశిర్ కుమార్ మిత్ర కలకత్తాలో 1890 లో జన్మించిరి భగల్పూర్ కళాశాలయందును, కలకత్తా ప్రెసిడెన్సీ కళాశాలలోను విద్య నభ్యసించిరి 1919 లో కలకత్తా విశ్వవిద్యాలయమువారు వీరికి D Sc. పట్టము నొసగిరి ఆ సంవత్సరములోనే వీరు పారిస్ విశ్వవిద్యాలయమునకేగెంచి 1923 లో స్వదేశమునకు తిరిగివచ్చిరి వెంటనే కలకత్తా విశ్వవిద్యాలయములో భౌతిక శాస్త్రములో ఖైరా ప్రొఫెసర్ గా నియమింపబడిరి నిస్తంత్రి ప్రసారము (వైర్లెస్ కమ్యూనికేషన్స్) రేడియోలో ముందు ముందు ఎంతయూ అభివృద్ధి పొందగలదని ఆచార్య మిత్ర ఆ రోజులలోనే గ్రహించి, వైర్లెస్ శాస్త్రమును పెద్ద తరగతులలో బోధించుట మొదలిడిరి. అంతేకాక వారు ఆ శాస్త్రములో పరిశోధనలు కూడ మొదలిడిరి 1935 లో వారు సర్ రాష్ బిహారిఘోష్ ప్రొఫెసర్ గా నియమింపబడి, పదంబను 1955 లో రిటైర్ అగునరకు ఆ పదవి యందే యుండిరి

భారత ప్రభుత్వమునకు చెందిన కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ యిండస్ట్రియల్ రిసర్చి వారిచే రేడియో పరిశోధన సంఘమును స్థాపింపజేయుటకు ఆచార్య మిత్ర కారకులు ఈ సంఘటనమునకు ప్రప్రథమ అధ్యక్షులుగా వీరు 1943-48లో పనిచేసిరి. వీరి కారణమున కలకత్తా విశ్వవిద్యాలయములో 1949 లో రేడియో ఫిజిక్స్ అండ్ ఎలక్ట్రానిక్స్ శాఖ నెలకొల్పబడెను

ఆచార్య మిత్ర మనదేశములో రేడియోకు సంబంధించిన పరిశోధనలలో అగ్రగణ్యులు వారు యువకులకు, తన శిష్యులకు ప్రోత్సాహము నిచ్చి సహాయము చేయుటలో ఉదారబుద్ధి కలవారు

వీరు Upper Atmosphere అను గ్రంథమును రచించిరి ఈ విషయమును గురించిన గ్రంథము యిది యొక్కటే యగుటయే గాక అనేక అంశములలో యిది స్వతంత్ర రచనగా ప్రపంచ ఖ్యాతినొందినది. యిటీవల దీనిని రష్యన్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ వారు రష్యను భాషలోకి తర్జుమాచేయించి ప్రచురించిరి

ఆచార్య మిత్ర 1955 లో భారత విజ్ఞాన పరిషత్తు (Indian Seience congress) నకు అధ్యక్షత వహించిరి. భారత విజ్ఞాన వార్తాసంఘమునకు కూడా అధ్యక్షులు. ఈ సంఘమువారు "విజ్ఞానము-సంస్కృతి" (Seience and Culture) అను యింగ్లీషు మాసపత్రికను ప్రచురించుచున్నారు అంతర్జాతీయ జియోఫిజికల్ ఇయర్ కాలాన భారత జాతీయసంఘమునకు ఆచార్య మిత్రసభ్యులు అనేక భారతీయ, విదేశీయ వైజ్ఞానిక పత్రికా సంపాదక వర్గములలో సభ్యులు. మన దేశములో యిటువంటి ప్రఖ్యాతిగాంచిన శాస్త్రజ్ఞులుండుట మనకందరికి గర్వకారణము.

